విశ్వసాహిత్య గ్రంధమండలి

రెండో పుష్పం

# ఉర్దూ కథలు

బిచ్చగాడు
స్మశానం
కొత్త ఇల్లు
అబ్బాస్‌ఖాన్ - అతని మేక
తల్లి

ముప్పావలా

అనువాదకుడు
వేమూరి ఆంజనేయశర్మ

# మనవి

భారతదేశంలోని ప్రముఖ ప్రాంతీయభాషా సారస్వ తాన్ని తెలుగుపాఠకలోకానికి అందించ దలచుకొన్నాము. భారతదేశంలోని పదమూడు ప్రాంతీయ భాషల్లోనూ సజీవమైన సాహిత్యమున్నది. ఒక్కొక్క ప్రాంతీయ భాషనుండి ఐదుకు తక్కువగాకుండా కథలను సేకరించి మొదటి ప్రయత్నంగా ప్రకటించదలచుకొన్నాము. మొదట ఉర్దూ కథలను ప్రకటిస్తున్నాము. ఉర్దూ కథలను అనువ దించి ఇచ్చిన శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారికి మా కృతజ్ఞత.

ఇట్లు,
విశ్వ సాహిత్య గ్రంథమండలి

డాక్టర్ సయ్యద్ అఖ్తర్ హుస్సేన్ "రాయపురీ" సి. పి. లోని రాయపూర్ వాస్తవ్యుడు. ఉర్దూ కథా రచయితలలో పేరెన్నికగన్న నవయువకుడు. ఈయన రచనలను అభ్యుదయరచనలలో చేర్చవచ్చును. జీవితమునకు, మృత్యువునకు మధ్య ఏర్పడిన సంఘర్షణనే ఈయన కథావస్తువుగా స్వీకరిస్తూ ఉంటాడు. కళాదృష్టిలో అశ్లీలము, శ్లీలము అనే భేదభావాన్ని ఈయన పాటించడు.

"బిచ్చగాడు", "స్మశానం" రెండూ ఈయన ఉత్తమ రచనలు.

# బిచ్చగాడు

అది కలకత్తాలోఉండే ధోకడియాబగాన్‌లోని ఒక అనాథాలయం. ఒక చిన్నసందులో పశువులశాలలాగా ఉన్నది. తూర్పు దిక్కునుండి కొద్దిగా వెలుతురు వ్యాపిస్తున్నది; విధవరాలి కన్నీటిలాగా మంచు వర్షిస్తున్నది. విపరీతమైన చలి. అనాథాలయంలో అంధకారం వ్యాపించిఉన్నది. పూరిల్లు. పైనకప్పిన గడ్డి అక్కడక్కడ లేచిపోయి ఉన్నది. చుట్టూ తడికలు. నేలంతా చెమ్మ. ఆనేలమీద చినిగిపోయిన చాపలు, ఆ చాపల మీద కొంతమంది మనుష్యులతోబాటు, కొన్నికుక్కలు పడుకొని ఉన్నవి.

ప్రాతస్సమీరుడు ఆ అనాథాలయంచుట్టూ వ్యాపించి ఉన్న మద్యం వాలూకు దుర్గంధాన్ని ఆఘ్రాణిస్తూ తనతో బాటుగా కొంత తీసుకొని పోతున్నాడు. ఆ సందునిండా పడివున్న కోడిగుడ్ల పైపొట్టూ, ఎంగిలి విస్తళ్లూ, నాకిపారేసిన ఎముకలూ, తాగిపారేయడంవల్ల బద్దలైన సారాయి సీసాలూ అన్నీ ఆ సందులోని ఇళ్ళల్లో రాత్రిళ్లు ఎలాంటి బీభత్సాలు జరుగుతూ ఉంటవో తెలియజేస్తూ ఉన్నవి. ఆ సందులో నివసించే వారంతా వేశ్యలు. పాపం! వాళ్లు తెల్లవార్లూ మేల్కొని, ప్రియులనే జంతువులు దయతలిచి వదలిపెట్టి వెళ్ళిన తరువాత తెల్లవారుజామున మురికిగుడ్డలతో మొఖాలు కప్పుకొని నిద్రపోతున్నారు. శరీరాలను అమ్ముకొని వారు ఆర్జించిన డబ్బు వాళ్ళ తలగడాల క్రింద ఉన్నది. రూపాయలూ, చిల్లరానూ. రూపాయలు తక్కువ, చిల్లర ఎక్కువ. ఎందువల్లనంటే వారి శరీరాల విలువ అంతతక్కువ. రాత్రిపూటఉండే శాంతి–నిస్తబ్ధత–ఎంతో సంగీతమయంగానూ, కావ్యమయంగానూ ఉంటుంది. కాని, వారి గార్దభసంగీతమూ, పిచ్చి ఆలాపనలూ, వెర్రినవ్వులూ శాంతిమయ వాతావరణాన్ని గూడా అశాంతంగా చేస్తూ ఉంటవి. చౌరంగిలో అంతా ధనవంతులు

ఉంటారు: చౌరంగీకీ, ఈసందుకూ భేదం ఏమిటంటే అక్కడ "పాపం" అనేది ఐశ్వర్యం చాటున దాగిఉంటుంది. ఇక్కడ నగ్నరూపంలో తాండవం చేస్తూ ఉంటుంది. అక్కడ "పాపం" అందమైన దుస్తుల్లోనూ, సుందరంగా ఉండే ఇళ్ళల్లోనూ చేరి "నాగరికత" అనే పేరును సంపాదిస్తుంది. ఇక్కడ అనాగరికత, ఉచ్ఛృంఖలత్వం అనే పేరుతో వ్యవహరింప బడుతుంది.

ఆ పాపనగరంలోదే ఆపశువులశాల—అనాధాలయం. తెల్లవారింది. ఒక దున్నపోతులబండి వచ్చి ఆ శాలముందు ఆగింది. బండివాడు కంబళి కప్పుకొని చలికి గడగడ వణకుతున్నాడు. బండిలోనుండి ఇంకొకడు దిగి అనాధాలయం తలుపుతాళం తీశాడు. ఆ తలుపు రేకులతలుపు. తెరుస్తూ ఉంటే ధణఫణా మోగుతుంది. ఆ తలుపు తెరచినవాడి చేతిలో గేదె చర్మంతో తయారుచేయబడిన కొరడా ఒకటి ఉన్నది. అతనిపేరు చౌదరీ. ఆ అనాధాలయం యజమాని అతనే.

తలుపు చప్పుడుకు లేచి లోపలివాళ్ళు కొంతమంది ఆవలించారు. కొంతమంది లేచి నిలబడ్డారు. అంతా గుడ్డివాళ్ళు. తొందరలో ఒకడి కొకడు తగిలి కిందపడ్డారు. అదృష్టదేవత ఇంటితలుపుల్లాగా వాళ్ళకళ్ళు మూయబడి ఉన్నవి. కొంతమంది కళ్ళు తెరవబడే ఉన్నా, పాపం! వారికి ఏమీ కనపడేదికాదు. ఎవరికళ్ళవంక చూసినా కన్నీళ్ళకుమాత్రం ఏమీ కొదవలేదు.

ఆ గుడ్డివాళ్ళల్లో మొగవాళ్ళూ ఉన్నారు. ఆడవాళ్ళూ ఉన్నారు; పిల్లలూ ఉన్నారు; ముసలివాళ్ళూ ఉన్నారు: నవయువకులూ, నవయువతులూ గూడా ఉన్నారు. రాత్రి ఏడుగంటలకు ఆ దున్నపోతులబండి అందరినీ పోగుజేసుకొని ఎక్కించుకొని వస్తుంది. అందరూ బండిదిగి ఆ పశువులశాలలో తమతమ చాపలమీదకు చేరుతారు. ఒకడొచ్చి వారి మల్లల్లో అన్నం పడేసి పోతాడు. హోటళ్ళల్లో మధ్యాహ్నం మిగిలి పోయిన అన్నం, కూరలూ, ఎముకలూ, మాంసపు ముక్కలూ అన్నీ ఆ అనాధాలయం యజమాని కొనితెస్తాడు. హోటళ్ళల్లో భోజనంచేసి పారేసిన ఎంగిలికూడుసుగూడా హోటలు యజమానులు అనాధాలయానికి అమ్మి సొమ్ముచేసుకుంటూ ఉంటారు. గుడ్డివాళ్ళు ఆ మల్లల్లో పెట్టిన కూడు తింటారు. మధ్యమధ్య కుక్కలుగూడా ఆ గుడ్డివాళ్ళతోబాటు ఆ

మల్లల్లోనే మూతులుబెట్టి ఆ అన్నంతింటూ ఉంటవి. కుక్కలు అన్నం తింటున్నవని వాళ్ళకు తెలిసేదేకాదు. అథవా, చప్పుడునుబట్టి తెలిసినా అవి ఎంతనెట్టినా పోయేవికావు. వాళ్ళు నెట్టలేకపోయేవారు. కాకపోయినా వాళ్ళకు ఆ కుక్కలుతప్ప నా అన్నవాళ్ళు ఇంకెవళ్ళున్నారు? అవిగూడా కోపగించి పారిపోతే వారి జీవితానికి తోడెవరు?

భోజనాలు పూర్తిఅయినతరువాత అందరూ చాపలమీద నిద్రబోయే వాళ్లు. జోలెలు తలక్రింద బెట్టుకొని బొంతలూ, కంబళ్ళూ కప్పుకొనే వాళ్ళు. ఒకరినొకరు స్పర్శచేత గుర్తించుకొనేవాళ్ళు. పిల్లలూ ముసలి వాళ్ళూ ఒకవైపునా, నవయౌవనంలో ఉన్న ఆడవాళ్ళూ మొగవాళ్ళూ ఇంకొకవైపునా పడుకొనేవాళ్ళు. మధ్య కుక్కలు పడుకొనేవి. పడుచు తనానికీ ముసలితనానికీ మధ్య ఈ కుక్కలపంక్తి పెద్దగోడలాగా అడ్డు ఉండేది. రాత్రిపూట ఒక్కొక్కప్పుడు ఒకప్రపంచంలోఉండేవాళ్లు ఇంకొక ప్రపంచంలోకి పోవాలని ప్రయత్నంచేస్తే కుక్కలు అరచి గోలచేసేవి. ముసలివాళ్ళ నిట్టూర్పులు చల్లగాఉంటే, పడుచువాళ్ళ నిట్టూర్పులు వేడిగా ఉండేవి. అందువల్ల ముసలివాళ్లు వేరువేరుగానూ, పడుచువాళ్ళు ఒకరొ్నకరు కాపలించుకొనీ పడుకొనేవాళ్ళు. అప్పుడప్పుడు అలికిడికి లేచి కుక్కలు ఆ మానవ సంఘాన్ని తీవ్రంగా విమర్శిస్తూ ఉండేవి.

తెల్లవారంగానే దున్నపోతులబండి తయారు. అనాథాలయం యజమాని గుడ్డివాళ్ళందర్నీ మేల్కొలిపేవాడు. రేకుతలుపు తెరిచేవాడు. జోలెలు చేతికి తగిలించుకొని తుళ్ళిపడుతూ బయటకువచ్చే గుడ్డివాళ్ళను లెఖ్ఖపెట్టుకొనేవాడు. అప్పుడప్పుడు ఇద్దరు ముగ్గురు ఇంకా నిద్రపోతూనే ఉంటే (అలాంటిది పడుచువాళ్ళ విషయంలో తరచు జరిగేది) అలాంటి సమయంలో యజమాని లోపలికిపోయి, లేచి దున్నపోతుల బండి ఎక్కేదాకా చేతిలోవున్న చర్మపు కొరడాతో వాళ్ళను చావగొట్టే వాడు. చచ్చిపోయిన జంతువు చర్మం బ్రతికివున్న మనుష్యుని చర్మంతో కలిసి కలుగజేసే బాధకు అంత పడుచుదనంలోఉన్నా, పాపం! ఆ నవ యువకులు భోరుమని ఏడ్చేవాళ్ళు. ఈశ్వరుణ్ణీ, మనుష్యుణ్ణీ తిట్టుకొనే వాళ్ళు.

దున్నపోతులబండి బయలుదేరి అందరినీ వాళ్ళవాళ్ళ స్థానాల్లోకి చేరిస్తే గుడ్డివాళ్ళంతా బజారు మూలల్లో కూర్చొని ఆకాశంవైపుకు తల

లెత్తి "బిచ్చం వెయ్యండి బాబూ!" అంటూ చెవులు చిల్లులుపడేటట్లు అరిచేవాళ్ళు. ఒకడు "నాలుగు రోజులనుండి అన్నంలేదు బాబూ!" అంటే ఇంకొకడు "ఐదురోజులనుండి ఆకలికి పిల్లలు చచ్చిపోతున్నార"ని అరిచే వాడు. ఒకడు పాప పుణ్యాలను గురించి ఉపన్యాసం ఇస్తూఉంటే ఇంకొకడు "ఈ తనువు శాశ్వతం కాద"ని వేదాంతం బోధిస్తూ ఉండేవాడు. బిచ్చగాళ్ళు సరిగా బిచ్చం అడుగుతున్నారో లేదో, లేక నిద్రపోతు న్నారోచూసి ఎప్పటికప్పుడు యజమానికి నివేదించడానికి కొంతమంది సి. ఐ. డీలు నియమింపబడి ఉండేవారు. సరిగా అరవలేదని సి. ఐ. డీ రిపోర్టు పోయిందంటే ఆనాడు ఆ బిచ్చగాడికి ఆ ఎంగిలి కూడుగూడా దొరికేదిగాదు; పైపెచ్చు ఆ చర్మపు కొరడా తాండవమాడేది.

రాత్రి దున్నపోతులబండి మళ్ళీ శాలకు చేరేది. శాలకు చేరడంతోనే బిచ్చగాళ్ళు సంపాదించిన డబ్బంతా యజమానికి అప్పగించాలి అర్ధ రూపాయకి తక్కువ ఎవ్వరూ సంపాదింపగూడదు. అర్ధరూపాయకు ఒక అణా తగ్గినా కొరడా క్షమించేదికాదు. అందువల్ల బిచ్చగాళ్ళు దాతల సానుభూతిని సంపాదించడానికి రకరకాల వేషాలు వేసేవాళ్లు.

గుడ్డి బిచ్చగాళ్ళకు రాత్రిళ్ళూ, పగళ్ళూ అన్నీ సమానంగానే ఉండేవి. పాసిపోయిన ఎంగిలికూడూ, ఎండిపోయిన రొట్టె ముక్కలూ, కొరడా దెబ్బలూ తప్ప వాళ్ళకు ప్రపంచం ఏమున్నది?

ఒకరోజు రాత్రి గుడ్డివాళ్ళకు అన్నం వడ్డించే సమయంలో కుక్క లెందుకో మొరగడం ఆరంభించినవి. బిచ్చగాళ్ళు "ఏదో కొత్తప్రాణి వచ్చింద"ను కొన్నారు. వడ్డించేవాణ్ణి అడిగారు.

రధియా అనే పిల్ల వచ్చిందనీ, చాలా అందంగా ఉన్నదనీ, బహుశా దాని రూపాన్నిచూసే చాలామంది బిచ్చం వేస్తారనీ" వడ్డించే వాడు జవాబు చెప్పాడు.

జ్యోతిర్హీనమైన కళ్ళతో గుడ్డివాళ్ళంతా సానుభూతిసూచకంగా కుక్కలు మొరిగేవైపుకు చూశారు, కాని, నందూమాత్రం వంచిన తల ఎత్తకుండా మల్లలో వున్న కూరముక్కలు తింటూ ఉండిపోయినాడు.

నందూ ఒక రసాయనద్రవ్యాలు తయారుచేసే కార్ఖానాలో పని చేస్తూ ఉండేవాడు. ఒకరోజున అతని చేతిలోనుండి ఒక సీసా కింద పడి బద్దలైపోయింది. ఆ సీసాలోని మందుచుక్కలు రెండు మూడు చింది అతని కళ్ళల్లో పడ్డవి. కళ్ళు రెండూ ఇక కనపడలేదు. ఆ నాటి నుండి అతనికి ప్రపంచం అంధకారం అయిపోయింది. గుడ్డివాణ్ణి కార్ఖానా యజమానులు నౌకరుగా అట్టిపెట్టుకుంటారా? నౌకరీ పోయింది. కొన్ని నెలలపాటు తిండిలేక ఉపవాసాలుచేస్తూ కలకత్తాలో నానాబాధలూ పడ్డాడు. చివరకు ఈ అంధాలయంలో చేరాడు. సంవత్సరం నుండి అతనికి ఇదేజీవితం, అయినా అతనిలోని వేడిరక్తం ఆవేడిరక్తములోని అగ్నిమాత్రం అతణ్ణి వదిలిపెట్టలేదు,

అందరూ పడుకొన్నారు. నిద్రపోతున్నారు. ఎముకలు కొరికే చలి. బొంతలు కప్పుకొన్నవాళ్ళుగూడా గడగడా వణికిపోతున్నారు. నందూ బొంతను బిడాయించి కప్పుకొన్నాడు. అతనికెందుకో ఆనాడు నిద్రపట్టలేదు. ఇంతలో తన బొంతను ఎవరో లాక్కుంటూఉన్నట్లు అతనికి తోచింది. కుక్క అనుకొన్నాడు, కుక్కను నెడదామని చెయ్యి పక్కకు చాచాడు. చెయ్యి కుక్కమీదకాదు; ఎవరిదో శరీరంమీద పడింది. ఒళ్ళు జల్లుమన్నది. ఆ శరీరం ఎందుకో ఆ కొత్తగా వచ్చిన రధియాదని అతనికి అనిపించింది.

"రధియా!"

"ఆ! నువ్వెవ్వరు?"

"నా పేరు నందూ, బొంత ఎందుకులాగావు? చలిగాఉన్నదా?"

"నా దగ్గర కప్పుకొనేటందుకు ఏమీలేదు. కాళ్ళు చల్లబడిపో తున్నవి. అందుకని బొంత లాగాను పొరపాటు చేశాను."

నందూలేచి తనబొంతను రధియాకు కప్పాడు. తాను అలాగే కూర్చొన్నాడు. తన పూర్వజీవితం అతనికి జ్ఞాపకం వచ్చింది. అతనికి గూడా కళ్ళుఉండేవి. రంగునూ వెలుతురునూ చూడగలిగేవాడు. రంగు, సంగీతం, ప్రకాశం ఈమూడింటి సంయోగంవల్ల సౌందర్యముత్పన్న మవుతుంది. ఆ సౌందర్యాన్ని మానవుడు కళ్ళద్వారాచూసి ఆనందిస్తాడు. కాని ఇప్పుడు అతను శబ్దంద్వారానే సౌందర్యాన్ని తెలుసుకోవాలి. నందూ, రధియా కంఠధ్వనిమీద ఆధారపడి ఆమె సౌందర్యాన్ని తన

పడింది. పిన్ని చెప్పినట్లు చేస్తే తమ దరిద్రం పోతుందనీ, తల్లి దండ్రులు సుఖంగా జీవితం గడపగలరనీ, చెప్పిన మాటలు ఆమెకు బోధపడినవి. తనవల్ల తన తల్లిదండ్రులకు సుఖం కలిగితే మహదానందం అనుకొన్నది. పిల్లకాకి ఉండేలుదెబ్బ నెరుగదు.

రాత్రి తొమ్మిది, పది గంటలైంది. రధియా ఒక గదిలో మెత్తని పక్కమీద కూర్చొని ఎవరికోసమో నిరీక్షిస్తున్నది. ఎవరో తలుపు తట్టారు. పిన్ని తలుపుతీసింది. ఆ వ్యక్తి లోపలికి వచ్చాడు. పిన్ని తలుపు వేసిలోపల రధియా దగ్గరకువచ్చింది. అవ్యక్తిగూడా రధియా దగ్గరకువచ్చి పరుపుమీద కూర్చొన్నాడు. తన రెండు కఠోర హస్తాలతో రధియాగడ్డం పట్టుకొని ఆమె వివర్ణమైన ముఖాన్ని పైకెత్తాడు. ఈ మధ్యలోనే పిన్ని అతనితో వివాదపడింది. దానికి ఫలితంగా ఘల్లని రూపాయలు మోగినవి. పిన్ని ఆ రూపాయలను రధియా పమిటచెంగుకు మూటగట్టి రధియాను బుజ్జగించి మెల్లగాలేచి గది బయటకు వెళ్ళిపోయింది. తలుపులు బయట గడియవేసింది. రెండు హస్తాలు రధియాను చుట్టుముట్టినవి. — ఇదేనా ప్రేమ!! దుర్గంధమయమైన నోరు ఆమె పెదవుల్ని ముద్దుగొన్నది. ఆమె బుగ్గలకూ, దవడలకూ ముళ్ళలాంటి వెండ్రుకలు గుచ్చుకొన్నవి, దుర్వాసనకు ఆమె ముక్కు బద్దలైపోయింది. ఈ జంతువేనా ప్రియతముడు? రధియా జీవితం అంధకారమయమైపోయింది.

అదిమొదలు రోజూ పిన్ని రధియాను ఆ గదిలోనికి తీసుకొనిపోయి ఉదయం యింటికి చేరుస్తూ ఉండేది. ప్రతిరోజూ క్రొత్త క్రొత్త "ప్రియతములు" వచ్చేవాళ్ళు. రోజూ క్రొత్త క్రొత్తగా ఆమెకు వివాహం అవుతూ ఉండేది. అలా రెండు సంవత్సరాలు గడిచినవి. రోజూ ఆమె శరీరం అమ్మబడుతూ ఉండేది, ఇవాళ ఈ బజార్లో, అయితే రేపు ఆ బజార్లో — తక్కిన కధంతా అనవసరం. తిరిగి తిరిగి ఆమె చివరకు ఈ అనాధాలయంలో చేరింది.

# 3

ఒక రోజు రాత్రి రధియా అనాథాలయానికి రాలేదు.

నందూ ద్వారంవంక ముఖంపెట్టి రధియా పదధ్వనికోసం ఎదురుచూస్తూ కూర్చొన్నాడు. మల్లలో ఉన్న అన్నం కొద్దిగా నంజాడు. ఎక్కువ భాగం మల్లలో మూతిబెట్టి, కుక్క తినేసింది. అతడది గమనించనేలేదు. రాత్రి ఒంటిగంట, రెండుగూడా అయింది. మిగతా అంధులూ, కుక్కలూ అందరూ నిద్రపోయారు. నందూ మాత్రం అలానే కూర్చొన్నాడు. రధియా రాలేదు. లేచి ఎవరిదో శరీరం తడివి చూచాడు. ఉహుం. రధియాకాదు. మళ్ళీ తనచోటికి చేరుకున్నాడు. పడుకొన్నాడు. నిద్ర రాలేదు. జీవిత విభూతి అంతర్హితమయిపోయిందనుకొన్నాడు. ఇంత వరకూ అతని నయనపథమే శూన్యం. ఈనాటినుంచి అతని జీవితపథం గూడా శూన్యమే.

తెల్లవారింది. చౌధరీ లోపలికివచ్చాడు. "రధియా పారిపోయిందా? రాత్రి రాలేదు" అని నందూ చౌధరీని ప్రశ్నించాడు.

చౌధరీ నవ్వాడు. కొరడా ఫెళ్ళున మోగించాడు, నందూ "అబ్బా" అన్నాడు. "నీకు అది తగదురా. దాన్ని రాయ్ హీరాచందుకు ఐదువందలకు అమ్మేశాను" అంటూ ఉల్లాసంలో చౌధరీ నందూకు నాలుగు కొరడా దెబ్బలంటించాడు.

నందూ నేలమీద కూలబడ్డాడు. కొరడా దెబ్బలబాధ సహించలేక లేచి దున్నపోతులబండి ఎక్కాడు. తను రోజూ బిచ్చమడిగే చోటికి చేరాడు. మనుష్యునిలో ఆత్మ అనేది ఉంటుందని ఎవరో చెప్పితే విని ఉన్నాడు. కాని, అతనికది ఎప్పుడూ అనుభవంలోకి రాలేదు. కాని, రధియాతో పరిచయం కలిగిన తరువాత అతని జీవితంలో అతనికేదో కొత్త అనుభవం కలిగింది.

ఆ రధియా ఏది? రాయ్‌హీరాచందుకు బలిఅయిపోయింది. ప్రపంచమంతా అతనికి అంధకారబంధురమై పోయింది. ఆరోజు నందూ ఎవ్వరినీ బిచ్చమడగలేదు. రోజూ వాడి అరుపు వినలేక బాధపడే పక్కనున్న దుకాణదార్లందరూ ఆరోజు వాణ్ణిచూసి ఆశ్చర్యపడ్డారు.

ఏడింటికి దున్నపోతులబండి వచ్చింది. నందూ దానిలో ఎక్కి కూర్చున్నాడు. బండి అంధాలయానికి చేరింది. చౌధరీ అందరి దగ్గరా డబ్బులు వసూలుచేస్తూ నందూనుగూడా అడిగాడు. నందూ ఒక అణాతీసి చౌధరీ చేతిలో పెట్టాడు. మిగతా డబ్బులు ఇవ్వవేమిరా, వెధవా? అని గద్దించాడు చౌధరీ.

నందూ జవాబు చెప్పలేదు. ఒక్క గుద్దుగుద్ది జోలె లాక్కొని పరిశీలించి చూశాడు చౌధరీ. డబ్బులులేవు- తరువాత ... .... ....

ఆకలిమంట, కొరడాదెబ్బలవల్ల నందూకు ఆనాటి రాత్రి నిద్ర పట్ట లేదు. తరువాత రెండు రోజులవరకూ అలాగే జరిగింది. అణాకంటే నందూకు ఎక్కువ దొరకలేదు. బిచ్చగాడు అరిస్తేనేగాని దాతలుగూడా బిచ్చం వెయ్యరు. మౌనంగాఉండే బిచ్చగాణ్ణి చూస్తే బిచ్చం వెయ్యడానికి దాతకుగూడా చేతులురావు. నందూ బండబారిపోయినాడు. నాలుగోరోజున గూడా అలాగే జరిగితే చౌధరీ నానాదెబ్బలు కొట్టి అతణ్ణి ఆ పశువుల శాలలోనుండి వెళ్లగొట్టేశాడు.

వేసవికాలం. అర్ధరాత్రి సమయం. ఎక్కడకు పోవాలో నందూకు తెలియలేదు. ఆకలి మండిపోతున్నది. కాళ్ళు తేలిపోతున్నవి. సర్క్యులర్ రోడ్డు ఫుట్‌పాత్ దగ్గరకు వచ్చాడు. ఇక ముందుకు పోలేకపోయి నాడు. ఆకలి! ఆకలి!! ఆకలి!!! భగవంతుడు ఈ నరకలోకంలో అతణ్ణి జన్మింపజేశాడు. కార్ఖానాలో కళ్ళుపోయినవి. కొరడాతో బాది వెళ్ళగొట్టాడు అంధాలయపు యజమాని, ఎండిన రొట్టెలూ—పోయినకళ్లూ సమాజం అతనికి ప్రసాదించిన వరప్రసాదం. అంతే. చివరకు అతనిజీవిత మరుభూమిలోకి ఒకచిన్న సెలయేటిధార ప్రవహించి వస్తే ఒక సేఠ్ దాన్ని గూడా ఎండిపోయేటట్లు చేశాడు. ఆకలి, చీకటి!—చీకటి? ఆకలి!!! పైన నక్షత్రాలు మానవుని పరిస్థితిని చూసి మౌనభాషలో తమలోతాము విచార పడుతున్నవి. అలసి సొలసి ఆ ఫుట్‌పాత్‌మీద నందూ నిద్రపోయాడు. అతనిబోటి అభాగ్యులు ఆ స్థలంలో ఇంకా చాలామంది పడుకొన్నారు.

అకస్మాత్తుగా ఫుట్‌పాత్‌మీద నిద్రపొయ్యేవాళ్ళంతా లేచి అటూ ఇటూ అరుస్తూ పరుగెత్తుతున్నారు. నందూకు నిద్ర మెళుకువ వచ్చింది. వాళ్ళ అరుపుతోపాటు లాఠీదెబ్బల ధ్వనిగూడా నందూకు వినపడింది. అతనిమీదగూడా మూడు లాఠీదెబ్బలు పడినతరువాత గాని విషయం అత

నికి బోధపడలేదు. పోలీసుల లాఠీలు — కాలదండాలులాగా ఉన్నవి. మనుష్యుని చేతిలోవున్న ఒకప్రాణంలేని కర్రముక్క ఎముకల్ని విరగ్గొడుతూ, మాంసంలోకి జొరబడుతూ, మానవరక్తాన్ని కాల్వలక్రింద ప్రవహింప జేస్తూ ఉన్నది. బిచ్చగాళ్ళు కూలీలు, బీదవారు, అయితేమాత్రం వాళ్ల ఫుట్ పాత్‌మీద ఎందుకు నిద్రపోవాలి? అద్దెలిచ్చి ఇళ్ళల్లో ఉండలేనివారికి ప్రపంచంలో జీవించడానికి హక్కేమున్నది? ఆ రోడ్డుప్రక్కన ఉన్న పెద్దపెద్ద భవనాలు ఈ దరిద్రుల్ని చూసి నవ్వుతున్నవి. ఈ కూలీలే— ఈ బీదవారే—ఆ భవనాలను నిర్మించింది. ఆ భవనాల గోడల్లో ఉన్న ప్రతి ఇటుకముక్క, ఈ దరిద్రుల— ఈ కష్టజీవుల స్వేదంలో— రక్తంలో—స్నానం చేసినదే. ఈ ఫుట్‌పాత్‌నూ, ఈ ఇళ్ళనూ, ఈ రోడ్డునూ, ఈ ప్రపంచాన్నీ సృష్టించేదెవరు? కాని ఆ దరిద్రులకు— ఆ కష్టజీవులకు — ఇల్లులేదు; వాకిలిలేదు; ఆశ్రయం లేదు; సహాయంలేదు, దొరికినవాళ్ళను బాదుకుంటూ ఫుట్‌పాత్‌మీద నిద్రబోయే అభాగ్యుల్ని వెదుక్కుంటూ పోలీసులగుంపు తుపానులాగా ముందుకు సాగిపోయింది. నందూ స్మృతిలేకుండా నేలమీద పడిఉన్నాడు. లాఠీప్రహారానికి తల బ్రద్దలైపోయింది, రక్తం ప్రవాహంగా కారి కిందఉన్న కన్నీటితో కలిసిపోతున్నది. సరిగ్గా ఆసమయంలోనే అతనికి ఎదురుగాఉన్న భవనంలో నుండి సంగీతస్రవంతి బయలుదేరి తూర్పు దిక్కాంతను మేల్కొల్ప ప్రయత్నిస్తున్నది. ఆ సంగీతం పాడుతున్న దెవరు? నందూ హృదయస్పందనం ఆగినట్లయిపోయింది. ఆ సంగీతాన్ని వినడంకోసం నందూ తన ఆత్మను వెదకి బయటకు తీశాడు. కాని ఆ సంగీతం పాడబడుతూఉన్న సభ ఎవరిది? ఎవరి సమక్షంలో ఆ సంగీతం? మధ్యమధ్య సిగ్గులేని వికటాట్టహాసాలూ, కుత్సితమైన పరిహాసాలూ, మద్యంలో కలపడానికి కొట్టబడే సోడాబుడ్ల ధ్వనులూ వినపడసాగినవి. అదే సేఠ్ హీరాచంద్ గృహమని నందూ తెలుసుకొన్నాడు.

అతని కళ్ళు మూతలు పడినవి.

# స్మశానం

నదీతీరంలో స్మశానం. అదొక పెద్ద మైదానం. మరుభూమి. నల్లమట్టి గడ్డకట్టిన నెత్తురులాగా.

స్మశానానికి పక్కగా కొన్ని వృక్షాలున్నవి. అక్కడ ఎప్పుడూ శిశిరఋతువే. ఆకులన్నీ రాలిపోయి మోళ్ళు నిలబడి ఉండేవి. ఆ వృక్ష శాఖలు క్షామపీడితులైన మనుష్యుల్లాగా ఎల్లప్పుడూ మేఘాలవంక చూస్తూ ఉండేవి. ఆ వృక్షాలమీద అదేమి కారణమో, కాకులూ, గద్దలూ తప్ప మరింకొక పక్షి ఏదీ వాలేదేకాదు. అక్కడక్కడ ఎముకముక్కలు, పుర్రెలూ దొర్లుతూ ఉండేవి. నది మెల్లగా ప్రవహించిపోతూ అప్పుడప్పుడు ఉత్సాహం కలిగితే వరదగావచ్చి స్మశానంలో వ్యాపించిఉన్న నిరాశా భావాన్నిచూసి, నా కెందుకని తన దారిని తాను తల వంచుకొని వెళ్ళిపోయేది.

ఒకనాడు కొంతమంది అక్కడికి ఒక శవాన్ని తీసుకొనివచ్చారు. శవాన్ని చితిమీద పెట్టారు. ఒక వృద్ధుడు చితిమీద నెయ్యిపోశాడు. ఒక చిన్న పిల్లవాడు ఆ చితికి నిప్పంటించాడు. బీదవాడి గుడిశలాగా చితి భగభగా మండడం ఆరంభించింది.

మొగవాళ్ళంతా ఒకవైపున ఉదాసీనంగా కూర్చొన్నారు. ఆడవాళ్లు ఇంకొక వైపున గుండెలు బాదుకొని ఏడుస్తున్నారు.

చితి భగ్గున మండుతున్నది. ఇద్దరు మనుష్యులు పెద్ద పెద్ద కర్రలతో శవాన్ని అదుముతున్నారు. సగం కాలిన మాంసపు ముక్కలు అటూ ఇటూ ఎగిరి పడుతున్నవి. మంటలు కుక్కలలాగా ఎముకలను పళ్ళకు కరచుకొని కటకటలాడిస్తున్నవి.

చీకటిపడింది. నక్షత్రాలు ప్రకాశించడం ఆరంభించినవి. ఎటు చూచినా ప్రశాంతత వ్యాపించి ఉన్నది. ఎముకల కటకటలు తప్ప ఇంకేమీ ధ్వని వినపడడంలేదు.

శవంతోకూడా వచ్చిన అజబీలోహార్ చితిలోనుండి నిప్పుతీసి చిలుము ముట్టించాడు. రెండు మూడు దమ్ములు పీల్చి తనతో మాట్లాడే వాళ్ళెవళ్లయినా ఉన్నారా అని అటూ ఇటూ చూచాడు. అందరూ ఉదాసీనంగా కనపడ్డారు.

మళ్ళీ రెండు దమ్ములులాగి ఆకాశంవంకచూసి అజ్ఞాత మిత్రుడితో సంభాషణ ప్రారంభించాడు. "తుపాకీగుండు సరీగా గుండెల్లో తగిలింది. సైడు కాలువలో దాక్కొని నేను అన్నీ చూస్తూనేఉన్నాను. మనవాడు జండా తీసుకొని ముందున్నాడు. ఉత్సవం చౌకువరకు అడ్డు లేకుండానేపోయింది. కాని, అక్కడ పోలీసువాళ్ళు అడ్డగించారు. ముందుకు పోకూడదన్నాడు పోలీసు ఇనస్పెక్టరు. మిగతా వాళ్ళంతా వెనకడుగువేశారు, కాని మనవాడు మాత్రం "మేము ముందుకే పోతామ" న్నాడు.

"కొంతమందయినా పారిపోవడానికి అవకాశం ఎక్కడ ఇచ్చారు? పోలీసులు రావడం, మీద బడడం రెండూ ఒకేసారి జరిగినవి. జనం పరుగెత్తుతూ కొంతమంది గుర్రాల కాళ్లక్రిందా కొంతమంది పక్క కాలవల్లోనూ పడ్డారు. లాఠీదెబ్బలకు ఎంతమంది కాళ్లూ చేతులూ విరిగినయ్యో లెఖ్ఖలేదు" అన్నాడు ఛోటూ.

అజబీలోహార్ "అవును, నీ మాట నిజమే. అయినా అతడు వీరుడు. జండాను కిందకు దింపకుండా అలాగే నిలబడ్డాడు. ఇంతలో అటునుండి జనం రాళ్లు విసిరారు. ఇటునుండి పోలీసులు తుపాకీ గుండ్లు పేల్చారు. తుఫానుకు మామిడిచెట్టు లాగా అంత బలవంతుడైన వాడూ ఒక్క గుండుదెబ్బకు నేలమీద పడిపోయినాడు ॥

అందరూ శాంతంగా ఆ చితిలో కాలుతూఉన్న వీరుని కళేబరం వంక చూశారు.

"అందరితోబాటుగా అతనూ పారిపోతే బ్రతికేవాడు. అంతా అదృష్టంలే" అన్నాడు నాయకుడు.

లఖ్బా మేస్త్రీ అందుకున్నాడు — నాయకుడూ! నువ్వన్నది తప్పు. ఈ విధంగా మాట్లాడితే అతని ఆత్మకుగూడా అపచారం చేసినట్లవుతుంది. అతడు అజ్ఞాని అయితే కావచ్చును. కాని ఇతర్లవలె పిరికివాడు మాత్రం కాదు: జాతీయ జండా గౌరవాన్ని రక్షించాడు."

"అయితే ఈ మూడుమూళ్ల గుడ్డమీదనే దేశ గౌరవం అంతా ఆధారపడి ఉన్నదన్నమాట. భార్యా పిల్లలూ ఉన్నారు; ముసలి తల్లిదండ్రులు మీరున్నారు. అతను చనిపోయినాడు. మీఅందరికీ దేశం అన్నం పెడుతుందా ? మీ గతి ఏమిటి ?" అన్నాడు నాయకుడు.

లఖ్బా దీర్ఘంగా నిట్టూర్చాడు. నాయకుడు అన్న మాటగూడా నిజమే. దేశం ధనవంతులకేగాని, బీదవాళ్లకు కాదు. నేలకు బాడుగా. నీళ్లకు పన్నూ. దీపానికి టాక్సూ. చస్తే స్మశానంలో కాపరికి నజరా అంతా డబ్బుతోవుంది పోనీ భగవంతుడున్నాడుగదా అనుకుంటే కానుకలూ నజరాణాలు ఉంటేనే గాని ఆ మూగదేవుడి దర్శనం గూడా లభించదు. బీదవాళ్లు డబ్బెక్కడ తెస్తారు ?

"అయితే పిల్లవాడుమాత్రం మూర్ఖుడా ? తన ప్రాణాలను ఎందుకు బలి ఇచ్చాడు ?" అని లఖ్బా ఆలోచించడం ఆరంభించాడు. పిల్లవాడు నేటి ఉదయంవరకూ ఆరోగ్యంగానే ఉన్నాడు. ఒక్కొక్క సమ్మెట దెబ్బకు ఇనుపకమ్మల్నిగూడా నీరుగా చేసి పారేశాడు కాని ఒక చిన్న తుపాకీగుండు అంతటి బలశాలి అయినా అతని గుండెల్లో జొరబడి, ఎముకల్ని విరగగొట్టి, మాంసాన్ని చీరి లోపలకు జొరబడింది. అతను చచ్చిపోయినాడు. బ్రతకడం ఎంతకష్టం! చావడం ఎంత తేలిక!!"

"పోనీ దేశం కోసం ప్రాణాల్ని అర్పించాడు. పేరూ, ప్రశస్తి ఉంటుందనుకొంటే ఇలాంటి వాళ్ళను అడిగేదెవరు ? పేరు ప్రశస్తులు పెద్దవాళ్ళకూ నాయకులకూను. బీదవాళ్లు బలిఅయితే మాత్రం వాళ్ళకు ఊరేమిటి ? పేరేమిటి ? కొద్దిరోజులు అతని దగ్గరి బంధువులు మాత్రం జ్ఞాపకం పెట్టుకొంటారు సమయం గడిచినకొద్దీ వాళ్లుగూడా మరచి పోతారు"

లఖ్బా అలాగే కూర్చొని ఆలోచిస్తూనే ఉన్నాడు రకరకాల భావాలు అతని స్మృతిపథంలోనికి వస్తున్నవి.

"ఉత్సవ ప్రారంభంలో తన కుమారుడిచేతికి జెండా యిచ్చిన పెద్దమనుష్య లెక్కడున్నారు? స్మశానం దగ్గరకైనా రారేం? వారంతా పెద్దవారు! ఈ శూద్రుల స్మశానంలోకి వస్తారా? రారు".

అయితే, పిల్లవాడు తప్పు చేసినట్లేనా? జెండా గౌరవాన్నీ, దేశ గౌరవాన్నీ కాపాడడానికి తుపాకీగుండుకు ఎదురు రొమ్మును సమర్పించాడు, అతనికప్పుడు ఎవ్వరూ జ్ఞాపకంవచ్చి ఉండరా? భార్యా, పిల్లలూ....

ఇంతలో ఆడవాళ్ళు ఏడుపు చాలించారు. వాచిన కళ్లతో శవం వంక చూశారు. శవంకాలి బూడిదైపోయింది. కొద్దికొద్దిగా అక్కడక్కడ మంట మండుతున్నది.

అఖ్తాకు మహాకోపం వచ్చింది, "ప్రపంచం స్వార్థాంధం. తన కుమారుడు దేశం కొరకు తన జీవితాన్నే బలిచేస్తే—ఇతర్ల కొరకు తన ఎదురురొమ్మును తుపాకీగుండుకు ఎరగా సమర్పిస్తే—చచ్చిపోయిన వాడి భార్యాపిల్లల్నీ, ముసలి తల్లిదండ్రుల్నీ ఓదార్చేవారు కూడా ఎవ్వరూలేరు."

కోపమంతా దిగమింగు కొన్నాడు. ఎవరిమీద కోపం?

"అజబీ! ఇంకా ఎంతసేపు పడుతుందో చూడు, ఆకలికి ప్రాణం పోతున్నది" అన్నాడు నాయకుడు.

ఛోటూ ఏదో మరిచిపోయిన మాట జ్ఞాపకానికి వచ్చినట్లు ముఖం పెట్టి "చెప్పడం మరిచిపోయినాను! నేను వచ్చేటప్పుడు హావల్‌దార్ కరీమ్‌ఖాన్ శవంతో స్మశానందాకా పోయిన వాళ్ళపేర్లుగూడా ప్రభుత్వం వారు వ్రాసుకొంటూరని చెప్పాడు" అన్నాడు.

"ఆఁ! అదేమిటి?

"చనిపోయినవాడు ప్రభుత్వంవారికి విరోధికింద లెఖ్ఖ. అతను గుండు పేల్చకపోయినా గుండుదెబ్బ తిన్నాడు. అందువల్ల ప్రభుత్వానికి అతనంటే ద్వేషం."

"నిజమేనోయి ఛోటూ" అంటూ నాయకుడు భయంగా అటూ ఇటూ చూడడం ప్రారంభించాడు.

"కరీమ్‌ఖాన్ హావల్‌దార్ సామాన్యుడా? పెద్ద పెద్ద షాహుకార్ల లాంటివాళ్ళ గూడా అతణ్ణిచూసి అదిరిపోతున్నారు. వాడు తలుచుకుంటే ఇళ్లు దోపిడీగూడా చేయించగలడు" అన్నాడు అజబీలోహార్. స్మశానంలో

ఉన్న మిగతావాళ్ళందరుగూడా కరీమ్‌ఖాన్ పేరు వినడంతోనే అదిరి పోయినారు.

అంధకారపూరితమైన అర్ధరాత్రిని ఆకులులేని చెట్లు బిచ్చమడుగు తున్నట్లుగా నక్షత్రప్రకాశంలో కన్పించసాగినవి.

లఖ్యూ మోకాళ్ళమీద అర్థచేతనావస్థలో కూర్చొనిఉన్నాడు. సహా యానికి వచ్చినవారంతా మెల్ల మెల్లగా ఒక్కరొక్కరే జారుకొన్నారు. కరీమ్‌ఖాన్ ఏమి చేస్తాడోనని భయం. చివరకు నలుగురో ఐదుగురో మిగిలారు.

లఖ్యూ క్షణకాలం లోలోపలనే కుళ్ళికుళ్ళి ఏడ్చాడు. కుమారుడు చనిపోయినందుకు కాదు. సోదరదేశస్థుల పిరికితనానికి. ఒకరోజున అందరూ ఈ చితిమీదకు చేరేవారే. అయినా ఎంతభయం! ఎంత స్వార్థం!!

మళ్ళీ ఆలోచనలు——

"కరీమ్‌ఖాన్‌మాత్రం సామాన్యుడా? పరమ దుర్మార్గుడు.

"ప్రతాపసింహుడు కాంగ్రెసుసంఘ కార్యదర్శి దేశభక్తుడు. కరీమ్ ఖాను అత్యాచారాలు చేస్తే నన్ను రక్షించలేడూ?"

"సేఠ్ ఛజ్జూమల్ - కాంగ్రెసు అధ్యక్షుడు. నా కుమారుడు దేశం కోసం ప్రాణాల నిచ్చాడు గనుక నేను ఆయన కివ్వవలసిన ఋణాన్ని రద్దుచెయ్యడూ?

"వర్షాకాలం వస్తున్నది. ఇంటికప్పు లేచిపోయింది. కప్పుకోవాలి. ఇంటిగోడ పడిపోయింది. బాగుచేయించుకోవాలి. కొలిమి చెడిపోయింది. బాగుచేయించుకోవాలి. చేతుల్లో శక్తిలేదు. డబ్బులేదు. ఎవరు సహాయం చేస్తారు?"

సాటి కూలివాడు——తోటి కూలివాడు చేసిన తుపాకీ గుండుదెబ్బకు ——చనిపోయినాడు. ఆశ్చర్యం!

చితిచల్లారింది. ఆడవాళ్ళు కుండతో నీళ్ళుతెచ్చి చితిమీదపోశారు. మొగవాళ్ళు చితిమీద వేడికన్నీళ్ళు కార్చారు. "నారాయణ, నారాయణ" అని అందరూ భగవన్నామ స్మరణం చేశారు. వక్కలు దూరాన్నుంచి "హూఁవా, హూఁవా" అని జవాబిచ్చినయి.

అందరూ ఇళ్ళకు బయలుదేరారు. లఖ్మాగూడా బయలుదేరాడు. కాళ్ళదగ్గర అతనికేదో గుడ్డకన్పించింది. ఆగుడ్డను ఎత్తిచూశాడు. చిరిగి పోయిన మూడురంగుల జండా. మృతవీరుడు—దేశభక్తుడు చనిపోయే టప్పుడు హృదయానికి కప్పుకున్న జెండా! అంత అందమైన జెండా ఇప్పుడు ఎంత అందవిహీనమైపోయింది! పచ్చగడ్డిలాగా ఆకుపచ్చ రంగు, ముసలితనంలాగా తెలుపు రంగు, జబ్బుమోస్తరుగా పసుపు రంగు!!! కాని, ఇప్పుడది రక్తంలో తడిసి ఎర్రనైపోయింది. ఎరుపు—జీవితానికీ,—మృత్యువుకూ సంబంధించిన రంగు!!:

ఆ జెండాలో ఏమి మహత్వం ఉన్నదో. జనం నవ్వుతూ నవ్వుతూ దానికోసం ప్రాణాల నర్పిస్తారు! మామూలు దూది, మగ్గంమీద నేశారు, పచ్చిరంగులు వేశారు.

దానిలో ఏ విశేషమైనా ఉండనీ, ఇప్పుడది ఒక మనుష్యుని రక్తంతో రంజితమయింది. ఆ రక్తంగూడా వసంతఋతువులోని పుష్పం లాగా, మండుతూ ఉండే అగ్నిలాగా, తాజాగా ఉన్నది.

తన ఇంట్లో గూట్లోఉన్న రాతిబొమ్మనుతీసివేసి దానిస్థానంలో తనకుమారుని రక్తంతో సిక్తమైన జెండాను ప్రతిష్ఠించ నిశ్చయించు కొన్నాడు.

ఏడుస్తూ స్త్రీలు ఇంటికి వెళ్ళారు.

తేలికగా గాలి వీచింది. రాత్రి కాంత పమిటచెరుగు మంచువల్ల తడిసిపోయింది. దూరాన్నుండి నది గాయపడిన పక్షిలాగా దీర్ఘంగా మూలిగింది.

భూమి మీద అగ్ని చల్లారిపోయింది. కాని ఆకాశంలో నక్షత్రాలు ప్రకాశిస్తూనే ఉన్నవి.

మహమ్మద్ ముజీబ్ ఆక్స్‌ఫర్డ్ గ్రాడ్యుయేటు. జామియా మిల్లియా ఇస్లామియాలో (ఢిల్లీ) హిస్టరీ ప్రొఫెసరు. జర్మనీ, రష్యా, ఫ్రెంచిభాషలలోపండితుడు. ఈయన ఉర్దూలో చాలా నాటకాలను వ్రాశాడు. "ఖేతీ, అంజామ్" అనే నాటకాలను మొన్నమొన్ననే ప్రకటించాడు. ఉర్దూ పత్రికలకు తరచు వ్యాసాలు వ్రాస్తూఉంటారు. ఈయన "ఉర్దూలో" రాజనీతి శాస్త్రము, "రష్యన్‌సాహిత్య చరిత్ర" అనే రెండు ఉద్గ్రంధాలను రచించాడు. కిమియాగర్ అనే పేరుతో ఈయన వ్రాసిన కధలు సంపుటిగా ప్రకటించబడినవి. ఈయన కధలలో మనోవిజ్ఞానం ఎక్కువగా ఉంటుంది.

# కొత్త యిల్లు

నెత్తిమీద ఏదైనా ఆపద వచ్చిపడితేనేగాని మనుష్యునికి భగవంతుడు జ్ఞాపకానికి రాడు. మతగురువు ఎన్నిసార్లు విషయలంపటత్వం కూడదని చెప్పినా వినక, అయూబ్‌ఖాన్ నవయౌవనంలో ఉన్న కూతురూ; పది సంవత్సరాల వయసుగల కొడుకూ వారం తిరగకుండా చనిపోయి, తసగడ్డంలో తెల్లవెంట్రుక కనపడిన తరువాత తన జీవితాన్ని మార్చుకొనే టందుకు ప్రయత్నం ప్రారంభించాడు.

జీవిత విధానం మార్చుకొన్న నాటినుండీ అయూబ్‌ఖాన్ తాను ప్రస్తుతం నివసిస్తూఉన్న ఇల్లుకూడా మార్చాలి అని నిశ్చయించుకొన్నాడు. అయూబ్‌ఖాన్ పెద్దలందరూ ఆ ఇంట్లో నివసించి అతనిలాగానే విషయ లంపటులై జీవితం గడిపారు. అందువల్ల ఆ యింటిలో నివసించినంత కాలమూ భగవదారాధనవైపుకు దృష్టిపోదని అతని అభిప్రాయం.

అందువల్ల తాను ఒక వేరే ఇల్లు అద్దెకు తీసుకొని తనకు పైత్రకంగా సంక్రమించిన ఇంటిని తన చివరి ఉంపుడుగత్తె నాజియాకు ఇచ్చివేశాడు. నాజియాకుగూడా తనసౌందర్యంమీద పూర్వమున్నంత నమ్మకం లేకపోవడంవల్ల ఆ ఇంటితోనే సంతోషించి చేపను వలలోనుంచి వదలి పెట్టింది. అయూబ్‌ఖాన్ తన నివాసార్థం కొత్తయిల్లు కట్టించడం ప్రారంభించాడు. నమాజు చేసిచేసి అలిసిపోయి విశ్రాంతి అవసరమని తోచగానే కొత్తయిల్లు ఎంతవరకు తయారయిందో చూడడానికి బయులు దేరేనాడు. అందువల్ల అతని మనస్సుకు చాలా కులాసా చిక్కేది. ఇల్లు తొందర తొందరగా తయారుకావడం చూసి భగవంతుడు తన ప్రార్థనలను అంగీకరిస్తున్నాడని అనుకున్నాడు. తన భుజాలమీద ఉన్న పాప భారం తేలిక అయిపోయిందనుకొన్నాడు. ఆకొత్తయింటికీ, అతని ఆత్మిక

జీవితానికీ ఒకరకపు అవినాభావ సంబంధం ఏర్పడిపోయింది. అందుకు తనలో తాను ఆశ్చర్యపడుతూ ఉండేవాడు.

తొందరగా యిల్లు కట్టించే భారాన్ని తన ఏజంటు ముమిద్దఖాన్‌కు అప్పగించాడు. శరవేగంతో యిల్లు పూర్తి చేయించవలెనని చెప్పాడు.

"ముమిద్దఖాన్ ! డబ్బుకోసం నువ్వు వెనకాడవద్దు. ఎంత డబ్బు కావాలన్నా అప్పుతెచ్చి అయినాసరే ఇస్తాను. ఫకీరు జీవితం గడపడం కోసం నేను ఈ యిల్లు కట్టించుకొంటున్నాను ఒక్కరోజు ఆలస్యమయినా నామనస్సుకు ఎంతోబాధ కలుగుతుందన్నమాట" అని చెప్పాడు.

ప్రతి రోజూ సాయంత్రం అయూబ్, ముమిద్దఖాన్లు ఇద్దరూ ఇలాంటి మాటలే మాట్లాడుకుంటూ ఉండేవాళ్లు.

"కప్పువేయించడానికి ఎన్ని రోజులు పడుతుంది?"

"పదిహేను రోజులు"

"గోడలకు సున్నం చేయించడం? తొందరగా పూర్తిచెయ్యాలి."

"చిత్తం. అలాగే"

అయూబ్‌ఖాన్ చీకటి పడిన తరువాత మోటరెక్కి అద్దె యింటికి వెళ్ళిపోయేవాడు.

ఇది జరిగిన మర్నాడు అయూబ్‌ఖాన్ మళ్ళీ మామూలుగా యిల్లు చూడడానికి వచ్చాడు.

"నవాబ్‌గంజిలో ఒక యిల్లు పూర్తిచేసిన కొంతమంది మేస్త్రీలనూ, కూలీలనూ మన పనికి పిలిచాను. వాళ్ళు చాలా తెలివైనవాళ్ళు. పది రోజులలోపలనే ఇల్లు పూర్తిచేస్తారు." అని ముమిద్ద చెప్పాడు.

"మంచి పని చేశావు"

అంటూనే అయూబ్‌ఖాన్ ఇంటిచుట్టూ తిరగడం ఆరంభించాడు. నిన్నటికీ, ఈ రోజుకూ మధ్య జరిగిన అభివృద్ధినిగురించి ముమిద్ద బోధపరుస్తూ పక్కనఉన్న మేస్త్రీలను చూపించి "పీళ్లు ఈ రోజున కొత్తగా పనిలోకి వచ్చినవాళ్ళు" అని పరిచయం చేశాడు.

మేస్త్రీలు యజమానికి వంగి సలామ్ చేశారు. "తమ ఆరోగ్యం బాగాఉన్నదా?" అని ఒక మేస్త్రీ కుశల ప్రశ్నచేశాడు.

అయూబ్‌ఖాన్ అతనికేమీ జవాబు చెప్పలేదు. అతని దృష్టి అంతా ఇంకొకవైపున ఉన్నది. ఆ మేస్త్రీలకు కొంచెం దూరంలో ఒక నవ యౌవనవతి కూలిపని చేస్తున్నది. తనవంక తదేకధ్యానంగా చూస్తూఉన్న అయూబ్‌నుచూసి ఆ పిల్ల చిరు నవ్వు నవ్వింది. అయూబ్‌ఖాను శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లనిపించింది. ముఖం ఎర్రబారింది.

"ఈ సున్నం బాగాలేదని మేస్త్రీలు తగాదాపెడుతున్నారు. మంచి సున్నం ఇంకొక కంపెనీలో తెప్పిస్తే బాగాఉంటుంది" అన్నాడు మునీమ్.

అయూబ్‌ఖాన్ అందుకేమీ జవాబు చెప్పలేదు. ఇల్లుగూడా పూర్తిగా చూడలేకపోయినాడు. ఎటుచూచినా అతనికి ఆపిల్ల సౌందర్యమే కన్పించ సాగింది. మేస్త్రీలూ, ఆ పిల్లా అందరూ తమతమ పనుల్లో మగ్నమై ఉన్నారు. అయూబ్‌ఖాన్ శరీరం స్వాధీనం తప్పిపోసాగింది. గుండెల్లో తుఫాను రేగింది. ఆ తుఫానునుండు తన పరిస్థితి గడ్డిపరకలాగా ఉన్న దని తెలుసుకొన్నాడు.

"కాని దీనికంతకూ కారణం? నేను అనేక వందలమంది నవయువతుల సౌందర్యాన్ని అనుభవించినవాణ్ణి. మరి ఈ సైతాను — ఈ కూలిపిల్ల — ను చూచినప్పుడు నాలో కలిగిన మార్పు కొత్తగా ఉన్నదే. ఇది ప్రేమకాదు. ఇది సౌందర్యం కాదు. ఇది కామ వాసనా జనితమైన హృదయోద్వేగం కాదు" అనుకుంటూ గబగబా ఇంటికి వెళ్ళి పోయినాడు. రెండుసార్లు నమాజ్ చేశాడు. భగవద్ధ్యానం ప్రారంభించాడు. ఆ కూలిపిల్ల మాత్రం అతని కళ్ళకు కట్టినట్లు కనపడుతూనే ఉన్నది. అయితే అంతమాత్రంచేత అతని ధ్యానం భగ్నం కాలేదు. అందువల్ల అది భగవంతుడికిగూడా ఇష్టమే ననుకొన్నాడు. కళ్ళవెంట నీళ్లు కార్చాడు. "ఆశ్చర్యం. ఆశ్చర్యం" అని పెద్దగా అరిచాడు.

ఉదయం నిద్ర లేచాడు. తాను మారిపోయినా ననుకొన్నాడు. సాధారణ దుస్తులు ధరించడం అంతకు పూర్వం శిక్షగా భావించేవాడు. కాని, ఆనాడు అతనికి ఆదుస్తులు చాలా అందంగా కనపడినవి. మనస్సుకు కులాసాగా ఉన్న దనుకొన్నాడు. ఫలహారం తెచ్చిన నౌకర్ని ప్రేమగా పలకరించాడు. అందుకు నౌకరుగూడా ఆశ్చర్యపడ్డాడు. చీవాట్లు లేకుండా అతను ఎప్పుడూ తిరిగి పోలేదు. ఆ రోజు తనతో పనిఉండి వచ్చినవా రందరితోనూ చాలా ఆప్యాయంగా మాట్లాడాడు.

సాయంత్రం కొత్తఇల్లు చూడడానికి బయలుదేరాడు. ఆ రోజు కూలీల దగ్గరకు పోయి కూర్చున్నాడు. కూలీలతో తానే మాట్లాడడం ఆరంభించాడు. తానుగూడా ఆ కూలీలలో ఒకడినే అనుకొన్నట్లుగా ప్రవర్తించాడు. ఒక ముసలి మేస్త్రీ కష్టపడి పని చేస్తూఉంటే చూచాడు. అతనంటే మరీ జాలిపడ్డాడు. అతని పక్కకు చేరి కూర్చున్నాడు.

"ఏమోయి, నీవుగూడా ఇక్కడికి ఇవాళే పనికి వచ్చావా ?"

"కాదు, బాబూ చాలా రోజుల్నుంచి ఇక్కడే పనిచేస్తున్నాను."

"మరి నీవు ఇవాళే కనబడుతున్నావేం ?"

"బీదవాళ్లను ఎవరు చూస్తారు బాబూ ?"

ముసలివాడన్న మాటకు అయూబ్‌ఖాన్‌కు కోపం రాలేదు. తానుగూడా వాళ్లల్లో ఒకడనై పోదామనుకున్నాడు. కూలీలకూ, తనకూ మధ్యనున్న ఇనుపగోడను పగుల గొట్టి వేయా లనుకున్నాడు.

"పాపం, నీవిక్కడ నెలరోజులనుండీ పనిచేస్తున్నా నేను ఇవాళే నిన్ను చూస్తున్నాను. ధనవంతుడు స్వర్గానికి పోవడం ఒంటె సూది బెజ్జంలోనుండి దూరిపోవడంవంటిదని మహమ్మద్ సాహెబ్ ఎందుకు చెప్పాడో ఇప్పుడు నాకు బోధపడుతున్నది. ఇంతవరకూ నా జీవితాన్ని చాలా ఉచ్ఛృంఖలంగా గడిపాను. ఈమధ్య నా ఇద్దరు బిడ్డలూ ఒకే వారంలో గతించారు. ఆనాటినుండి భగవంతుని ధ్యానించడం ప్రారంభించాను. భగవంతుని మరచిపోయినవాడి గతినిగురించి ఏమి చెప్పుతాం ?"

"నిజం బాబూ ! ఈ లోకమే భగవంతుడిది. అట్టి భగవంతుణ్ణి మరిచిపోతే ఈ లోకంలో ఉండడమెలా ?"

"అందువల్లనే ఆ పాతఇల్లుగూడా వదిలేసి, ఈ కొత్తయింట్లో కాపురముండి భగవద్ధ్యానం చేసుకొందా మనుకొంటున్నాను. ఈ ఇంట్లో బీదతనాన్ని అనుభవిస్తూ జీవితం గడపవలె ననుకొంటున్నాను."

అంటూ అయూబ్‌ఖాన్ ఏదో ఆలోచిస్తూ నిశ్శబ్దంగా ఉండిపోయినాడు. ముసలివాడు తన పని ప్రారంభించాడు. ముసలివాడూ, అయూబ్‌ఖానూ, ప్రాణస్నేహితు లైపోయినారు.

అక్కడనుండి మెల్లగాలేచి ఆ కూలిపిల్లదగ్గరకు పోయినాడు. ఆ పిల్ల అయూబ్‌ఖానును చూసి ఒక చిరునవ్వు నవ్వి తన పని తాను

చేసుకొంటున్నది. ఆ చిరునవ్వు అతనికి ఎంతో సంతోషాన్నిచ్చింది. ఆ చిరునవ్వులో ప్రేమా, సహానుభూతీ అతనికి కనిపించినవి. "ఆ చిరునవ్వులో ఉన్న శక్తి భాషలో ఎక్కడ ఉంటుందనుకొన్నాడు. కూలి పిల్లను తాను ప్రేమించడమేమిటి?" ఆలోచించాడు. "ప్రాణిమాత్రులనల్లా తాను ప్రేమించడం నేర్చుకోవలె" ననుకొన్నాడు.

ఆనాటినుండి కూలీలతో మనసువిప్పి మాట్లాడడం అలవరచుకొన్నాడు. ఆ మాటల్లో అతనికొక ఆనందం కలిగేది. ఆ ఆనందంతోనే భగవంతుని ఎదుట నమాజుచేసేవాడు. ఆ కూలిపిల్లను చూసినప్పుడల్లా అతనిలో ఏదో ఒక విచిత్రానుభూతి కలుగుతూ ఉండేది.

ఇల్లుకట్టడం పూర్తిఅయింది. గోడలకు సున్నం చేస్తున్నారు. అయూబ్ ఖాన్ ఇల్లు చూడడానికి వచ్చాడు. ముసలిమేస్త్రీ "ఏమి బాబూ! ఇంట్లో ఐదు గదులు కట్టిస్తున్నారు. మీరు ఎప్పుడూ నమాజు చేసికొంటూ ఉంటారు. మీకు రెండు గదులు చాలును. మిగతా గదుల్లో ఎవరుంటారు? మీరు పెళ్ళి ఎప్పుడు చేసుకుంటారు?" అని అడిగాడు.

అయూబ్ ఖాన్ నవ్వాడు. జవాబివ్వలేదు. అయూబ్ ఖాన్ భార్య ఐదుసంవత్సరాల క్రితం చచ్చిపోయింది. అప్పట్లో అయూబ్ ఖాన్‌కు పెళ్ళిచేసుకోవలసిన అవసరంగూడా లేకపోయింది. మేస్త్రీ అన్నమాట గూడా నిజమే. రెండోపెళ్ళి చేసుకుంటే తప్పేమిటి? మొదటిభార్యను కష్టపెట్టాను గనుక రెండోభార్యను సంపతోపెడితే—

కూలిపిల్ల కనపడింది. అయూబ్ ఖాన్ ఆ పిల్లను పలకరించి మాట్లాడడం ప్రారంభించాడు. లేచి ఆపిల్ల పనిచేస్తూఉన్నచోటికి వెళ్లాడు. ఆ పిల్ల తనభార్యఅయితే ఎలా ఉంటుందో చూద్దామని అతనికి అభిలాష కలిగింది. ఆమాటలూ, ఈమాటలూ మాట్లాడుతూ ఆపిల్లవంక తదేక ధ్యానంగా ఒక అరగంటసేపు చూశాడు. అతని కళ్ళముందు కొత్తఇల్లూ కొత్తజీవితం తాండవమాడసాగినవి. తను నమాజు చేస్తూఉంటే తన భార్య ఉండి ఉండి గదిలోకివచ్చి చూసి పోతూవుంటుంది. అప్పుడామె కళ్ళు ఎట్లా వుంటయ్యోనని ఆమె కళ్ళవంక చూశాడు. ఇద్దరూ కలిసి కులాసాగా షికారుకుపోతే అక్కడ సూర్యాస్తమయం అయితే ఆమె ఆనందంతో తన బుజంమీద చెయ్యివేస్తుంది. అప్పుడు ఆచెయ్యిశోభ

ఎలా ఉంటుందోనని ఆపిల్ల చేతివంక పదినిమిషాలు చూశాడు. రకరకాల మధురభావాలు! మధుర స్మృతులు!! తీయని తలపులు!!! మెల్లగా ఇంటికి వెళ్ళాడు. నమాజు చెయ్యబోతే మనస్కరించలేదు. ఏదోవిధంగా నమాజు బలవంతాన పూర్తిచేశాడు. భగవధ్యానం చెయ్యబోతే మనస్సు ఏకాగ్రంగా లేదు. కొత్తఇల్లు, కొత్తజీవితం కొత్తభార్య తలపులే.

మంచంమీద శరీరం వాల్చాడు. ఏమిటి ఈమార్పు? ధ్యాన మగ్నుణ్ణి కాలేకపోతున్నాను. ఈ కొత్తతుపానులో భగవంతుణ్ణే మరిచి పోతానా? అనుకొంటూ కళ్ళు మూశాడు. ఆ కూలిపిల్ల రెండుకళ్ళూ తనను ఆహ్వానిస్తున్నవి. ఆమె స్మరణమాత్రం చేతనే నమాజు చెయ్యలేక పోతున్నాను, తీరా రేపు ఆమెదగ్గరకు వస్తే? అని ఆలోచించాడు. ఆమెను నేను స్వీకరించడం భగవంతుడికి ఇష్టం లేదేమోనని మరి ఇం. కొక ఆలోచన, మనస్సు ఆగడంలేదు. ఆవేశం అధికమై పోతున్నది. కళ్ళుమూస్తే.... ఆ పిల్లకళ్లు....

ఆ పిల్లను వివాహం చేసుకోవడమా, లేదా అది ఒకసమస్య. ఆమెను వివాహమాడడమే మంచిది. అయితే బంధువులందరూ అంగీక రిస్తారా? కూలిపిల్ల కదూ? బంధువులకోసం ఆలోచిస్తే బంధువులు సమాజం పేరుతో విద్రోషుల్నిగూడా రోజూ కొరతన వేయిస్తున్నారు. అందువల్ల వాళ్లకోసం లెఖ్ఖచెయ్యకూడదు. కూలిదాన్ని పెళ్లి చేసుకొన్నా డని ఇంటి నౌకర్లుగూడా ఎగతాళి ప్రారంభిస్తారేమో!! బహుజనాభి ప్రాయం మార్చడం ఎలాగా? లాఠీ చూపించి అభిప్రాయం మార్పించ గలమా? ఒకరు ఎగతాళిచేస్తారని మనం ఏపని మానివేస్తున్నాం? ఆత్మ శుద్ధిగా మనం చేసేపనికి ఇంకొకరి అభిప్రాయాలతో పనేమిటి?"

ఇలాగా ఆలోచిస్తూనే ఉన్నాడు. నౌకరు టీ తీసుకొని రావడం ఆలస్యమయింది. నౌకర్ని పిలిచి టీ తీసుకొని రమ్మన్నాడు. నౌకరు టీ తీసుకొని రాలేదు గనుక. ఈ వివాహం సుఖకరం కాదు అనుకొన్నాడు.

ఏమేమో ఆలోచనలు!!

అర్ధరాత్రిదాకా అలాగే కాలం గడిపి చివరకు నిద్రపోయినాడు.

తెల్లవారింది. కొత్తఇల్లు చూడడానికి పోవాలి. కూలీలు పనిని ప్రారంభించి చేస్తూఉంటారు.

తన కొత్తజీవితం ఎలా ఉండాలో, ఉంటుందో, అదిగూడా ఆలో చించుకోవాలి. ఏమీ ఆలోచన తెగడంలేదు. మోటారు కొత్తఇంటికి చేరింది.

కూలీలంతా పెద్దపెద్దగా నవ్వుతూ ఏదో మాట్లాడుకొంటున్నారు.

అయూబ్‌ఖాన్ కారుదిగి ముసలిమేస్త్రీ దగ్గరకు వెళ్లాడు. ముసలి మేస్త్రీ "ఆ పిల్ల వెళ్ళిపోయింది బాబూ!" రెండు రోజులు కూలిగూడా వదిలేసి వెళ్ళిపోయింది అన్నాడు.

ఏ పిల్ల ?

అయూబ్‌ఖాన్‌కు ఆ పిల్ల పేరు తెలియదు. అయినా ఆ కూలిపిల్లే నేమో అనుకొన్నాడు.

"ఆ పిల్లేనండి. తమను చూసి నవ్వుతూ ఉంటుంది."

"ఎలా వెళ్ళిపోయింది ?

"మిర్దూగాడు తనకు కాన్పూరులో ఇల్లున్నదనీ. కూలిచేసి తిండి సంపాదించి పెడతాననీ చెప్పాడు. దానికి వాడిమీద ఆసక్తి కలిగింది. వాడితో అది లేచిపోయిందిబాబూ ?" అని మంగళ్ జవాబు చెప్పాడు.

"కూలి ఎందుకు వదలిపెట్టింది ?"

"మాకేం తెలుసు బాబూ ?"

అయూబ్‌ఖాన్ తల వంగి పోయింది. ముఖం వెలవెల బోయింది. మెల్లగా వెళ్ళి కార్లో కూర్చొబడ్డాడు.

"ఇంటికినడుపు" అన్నాడు డ్రైవరుతో. కారుముందుకు సాగింది. అయూబ్‌ఖాన్ వెనకకు తిరిగి కొత్త యింటిపైపుకు చూచాడు.

డాక్టరు జాకిర్ హుసేన్. యం. ఏ. పి. హెచ్. డి. లో ఉత్తీర్ణుడైనాడు. జామియామిల్లియా ఇస్లామియా సంస్థను నడిపేవారిలో ప్రధానుడు. అర్థశాస్త్రంలో గొప్ప పండితుడు. గాంధిమహాత్ముడు ప్రారంభించిన వార్ధా విద్యా విధాన ప్రణాళికకు ఈయన ప్రాణం వంటివాడు, పిల్లల మనోవృత్తిని గుర్తించడంలోనూ, చిత్రించడం లోనూ ప్రత్యేక ప్రావీణ్యం గలవాడు. ఈయన అద్భుతమైన కథలను రచించాడు. వాటిలో అబ్బూఖాన్ - అతని మేక ఒకటి.

# అబ్బాఖాన్ - అతని మేక

హిమాలయ పర్వతంపేరు మీరు వినేఉంటారు. అంతకంటే పెద్ద పర్వతం ప్రపంచంలో ఎక్కడాలేదు. వేలకొలది మైళ్ళ వెడల్పు. ఎత్తు విషయంలో హిమాలయ శిఖరంమీదకు ఇంతవరకు ఎవ్వరూ వెళ్ళనేలేదు. ఆ పర్వతానికి దగ్గరలో చాలా గ్రామాలున్నవి. అందులో ఆల్మోరా ఒకటి.

ఆల్మోరాలో అబ్బాఖాన్ అని ఒకాయన ఉండేవాడు. ఆయనకు మేకలంటే చాలా సరదా. కాని, ఒంటరిగాడు కావడంవల్ల రెండుమూడు మేకల్ని మాత్రమే మేపుతూ ఉండేవాడు. వాటిని రకరకాల పేర్లతో పిలవడంగూడా ఆయనకు సరదాయే. ఒక దానిని కల్లూఅనీ, ఇంకోదానిని ముంగియాఅనీ, మరొకదానిని గుజరీ, హుంకమూఅనీ రకరకాల పేర్లతో పిలుస్తూ ఉండేవాడు. పగలల్లా ఆ మేకలను మేపుతూ వాటితో ఏమేమో మాట్లాడి సాయంత్రం ఇంటికి తోలుకొని వచ్చేవాడు. ఆల్మోరా పర్వత ప్రాంతం కావడంవల్ల మేకలన్నీ కొండజాతివి అతనికి దొరికేవి.

అబ్బాఖాన్ దురదృష్ట మేమో పెంపుడు మేకలన్నీ ఎప్పుడో తాడు తెంపుకొని కొండమీదికి పారిపోయేవి. అక్కడ ఏ తోడేలుకో అర్పణమయ్యేవి. ఆ మేకలన్నీ కొండజాతివి కావడంవల్ల అబ్బాఖాన్ ప్రేమగానీ, అబ్బాఖాన్ రాత్రిపూట వాటికిబెట్టే దాణాగానీ, తోడేళ్ళభయం గాని, వాటిని కొండమీదకు పారిపోకుండా ఆపగలిగేవి కావు. ఆ మేక లకు స్వాతంత్ర్యము—స్వేచ్ఛ—అంటే అంత ప్రేమ కాబోలు. ఆపద లనుగూడా ఎదుర్కొడానికి సిద్ధంగా ఉండి కొండమీదకు వెళ్ళిపోయేవి.

మేకలు పారిపోతే అబ్బుఖాన్ మహావిచారపడేవాడు. పచ్చిగడ్డి కొనితెచ్చి వేసినా, రహస్యంగా ఇతర్ల చేలల్లో అప్పుడప్పుడు మేపినా ఆ పాడుమేకలు తోడేళ్ళకు తమ శరీరాన్ని అర్పించడానికి ఎందువల్ల తయారయ్యేవో, ఆకారణం అతనికి ఎంత ఆలోచించినా బోధపడేదికాదు.

చాలా మేకలు పారిపోవడం వల్ల ఇక మేకల్ని పెంచగూడదనుకొన్నాడు. కొద్దిరోజులు అలాగే ఓపికపట్టాడు. కాని ఒంటరిగా ఉండలేకపోయినాడు. ఎక్కడనుండో ఒకమేకను కొని తెచ్చాడు. అది పిల్లమేక. సంవత్సరం సంవత్సరంనర వయస్సుది. మొదటిఈత పిల్ల. కొద్దివయస్సులోనే తెచ్చి మంచి మేతవేసి పెంచితే అలవాటుపడి తన దగ్గరనే ఉంటుందనుకొన్నాడు. తెల్లటిరంగు మేక. చాలా అందంగా ఉండేది. వెంట్రుకలు పొడుగ్గానూ, కొమ్ములు నల్లగానూ అందంగా ఉండేవి. ఎర్రటికళ్ళు. ముద్దుగా ఉండేది. దాని స్వభావంగూడా మంచిదే. అబ్బూఖాన్ చెయ్యి నాకుతూఉండేది. పసిపిల్లవాడు వచ్చి పాలుపిండినా గంగగోవులాగా పాలిచ్చేది. అబ్బూఖాన్‌కు ఆ మేకఅంటే ప్రాణంతో సమానం. దానికి చాందినీ అని పేరుపెట్టాడు. దానికి రకరకాల కథలు చెప్పేవాడు. ఒకరోజున ఘసట్ ఖాన్‌కథ చెప్పితే, ఇంకొకరోజున నత్థూమామ కథ చెప్పేవాడు.

పూర్వం తాను మేకల్ని కట్టివేసేచోటనే దీనినిగూడా ఉంచితే బాగుండదని, తన ఇంటికి ఎదురుగాఉన్న పొలంలో ముళ్ళకంచె చుట్టూపాతి ఒక దొడ్డిలాగా ఏర్పాటుచేశాడు. అందులో మేకుపాతి పెద్దతాటితో చాందినీని కట్టివేశాడు. అది ఇష్టంవచ్చినట్లుగా తిరగడానికి అవకాశం ఉండేది. అలాగా చాలాకాలం గడిచింది. ఈ మేకపిల్ల ఇక పారిపోదనుకొన్నాడు.

అలా అనుకోవడం అబ్బూఖాన్ భ్రమ. స్వేచ్ఛా పిపాస అంత తొందరగా హృదయంలోనుంచి పోయేదికాదు. అడవుల్లోనూ, కొండమీదనూ విచ్చలవిడిగా స్వేచ్ఛగా తిరిగే జంతువులకు ఇలాంటి ఇల్లూ దొడ్లూ నచ్చవు. బందిఖానాలాగా ఉంటవి. కొద్దిరోజులు విధిలేక ఇలాంటి దొడ్లల్లో ఉన్నా వీలు దొరకగానే తాడుతెంపుకొని పారిపోతవి. చాందినీ పర్వతాలమీద తిరిగావే కోరికను వదలిపెట్టింది అనుకొన్నాడు అబ్బూఖాన్. పొరపాటు పడ్డాడు.

ఒకరోజు ఉదయం సూర్యుడు ఇంకా కొండచాటుననే ఉన్నాడు: చాందినీ పర్వతంవైపుకు చూసింది. నెమరు వేస్తూవున్న దానిదవడలు ఆగిపోయినవి. ఆహా! పర్వతం ఎంత అందంగా ఉన్నది! ఆ పర్వత శిఖరాలు ఎంత ఆకర్షకంగా ఉన్నవి! అక్కడి గాలికీ, నేనున్నచోట గాలికీ సంబంధమేమిటి? అక్కడ స్వేచ్ఛగా ఎగరవచ్చును, దూక వచ్చును. ఇష్టంవచ్చినట్లుగా విహరించ వచ్చును. ఇక్కడో అస్తమానం బంధనం. ఎప్పుడూ కట్టివేయబడి ఉండడమే; స్వేచ్ఛలేదు. ఇలాంటి దొడ్లలో గాడిదలు; కంచరిగాడిదలు ఉండవలసిందేగాని- నాబోటి మేకలు కాదనుకొన్నది.

చాందినీ మారిపోయింది. గడ్డితినడం, నీళ్ళుతాగడం మానేసింది. అబ్బూఖాన్ చెప్పేకథలు దానికి రుచించడంలేదు. చిక్కి శల్యమైపోవడ మారంభించింది. పాలు తగ్గిపోయినవి. తల పర్వతంవైపుకు పెట్టి ఎప్పుడూ "మే మే"అని అరవడం ప్రారంభించింది. మొదట్లో అబ్బూ ఖాన్‌కు విషయమేమిటో బోధపడలేదు. ఒకరోజున అబ్బూఖాన్ పాలు పిండుతున్నాడు. అబ్బూఖాన్! నన్ను స్వేచ్ఛగా వదలిపెట్టు. పర్వతాల మీదకు పోతాను అని తన భాషలో చాందినీ అడిగింది.

అబ్బూఖాన్‌కు మేకలభాష తెలుసు. అయ్యో! చాందినీకూడా వెళ్ళి పోతానంటున్నదే" అనుకొని విచారపడ్డాడు. చేతులు గడగడ వణికి చేతులోఉన్న పాలకుండ కిందపడి బ్రద్దలైపోయింది.

"చాందినీ! నన్ను వదలిపెట్టి వెళ్ళిపోతావా?" అని దుఃఖంగా మేకదగ్గరగా పచ్చిగడ్డిమీద కూర్చొని అడిగాడు.

"వెళ్లదామనుకుంటున్నాను" అని చాందినీ జవాబు చెప్పింది.

"మేత బాగా లేకనా, నీళ్లు బాగా లేకనా వెళ్ళిపోవడం? ఇవాళ నుండి మంచి దాణా తెప్పిస్తాన"న్నాడు అబ్బూఖాన్.

"అటువంటి లోపం ఏమీలేద"న్నది చాందినీ.

"అయితే మెడకుగట్టే తాడు ఇంకా పెద్దది తెప్పించమంటావా"

"అక్కర్లేదు" అన్నది చాందినీ

"అయితే, నీకు ఏమిటికావాలి?"

"ఏమీ అక్కర్లేదు నన్ను ఈ బందిఖానాలోనుండి ఆ పర్వతం మీదకు పోనిస్తేచాలు" అన్నది చాందినీ

"అక్కడ తోడేలుంటుంది. అదివస్తే ఏమిచేస్తావు ? "

"భగవంతుడు రెండు కొమ్ములిచ్చాడు. వాటితో పొడుస్తాను."

తోడేలును నీ కొమ్ములేమిచేస్తాయి ? ఆ తోడేలు నా మేకల్ని ఎన్నింటినో తిన్నది "కల్లూ" అనే మేకను నీవెరగవు. లేడిలాగా ఉండేది. నల్ల లేడిలాగా చంగున గంతేసేది. నీ కొమ్ములకంటేగూడా దాని కొమ్ములు ఎంతోవాడిగానూ, పొడవుగానూ ఉండేవి. పాపం! అది తెల్లవార్లూ తోడేలుతో దెబ్బలాడి చివరకు అలిసి చచ్చిపోయింది. తోడేలుకు చిక్కిపోయింది.

"పాపం! కల్లూకు ఏమిగతి పట్టింది! అయితేమాత్రమేమిలే. నన్ను వదలిపెట్టు" అన్నది చాందినీ.

అబ్బూఖాన్‌కు కోపం వచ్చింది. "నీవుగూడా వెళ్ళిపోతావా? ప్రాణంతో సమానంగా పెంచుకొన్న నిన్నుగూడా తోడేలుకు అర్పణం చెయ్యమంటావా? అలాంటిది జరగనివ్వనం"టూ అబ్బూఖాన్ చాందినీని ఒక ఇరుకు గదిలో వదలిపెట్టాడు. దానికి ఒక కిటికీ ఉన్నది. దానికి చువ్వలులేవు. తలుపుతీసివున్నది. ఆ కోపం తొందరలో కిటికీ తలుపు మూయడం మరచిపోయి గది తలుపుమాత్రం బయట గడియవేశాడు. చాందినీ అటూ ఇటూ చూచి చంగున ఆ కిటికీలోగుండా బయటపడి పర్వతం వైపుకు ఒకటే పోవడం ——

చాందినీ పర్వతంమీదకుపోయి వెనక్కు తిరిగి చూసింది. బ్రహ్మాండమైన పర్వతం. సంపూర్ణమైన స్వేచ్ఛ. ఏమీ బంధనంలేదు. పర్వతంమీది చెట్లను ఇదివరకుగూడా చూచింది. గాని ఇంత అందంగా లేవు. నీవు తిరిగి వచ్చినందుకు మాఅభివందనాలు అని చెట్లుచెప్పినట్లనుకొన్నది చాందినీ. ఇటుఅటూ తెల్లగులాబీపూలు కిలకిలా నవ్వుతున్నవి. పచ్చగడ్డి చాందినీ కంఠాన్ని ఆలింగనం చేసుకొంటున్నది. పర్వతం చిరునవ్వు నవుతున్నది. వెళ్ళిపోయిన పిల్ల తిరిగి రావడంవల్ల పర్వతం తన ఆనందాన్ని ఆపుకోలేకపోతున్నది. అవన్నీచూసి చాందినీ ఎంత సంతోషించిందో ఎవరు చెప్పగలరు? మెడకు తాడూ, తాడుకుమేకూ, అన్నింటి చుట్టూ ముళ్ళకంచె ఏమీలేదు. స్వేచ్ఛాజీవితం. అబ్బూఖాన్‌కు నేనంటే ప్రేమ ఉన్నమాట వాస్తవమే. అయినా ఈ ఆనందాన్ని అతడు యివ్వగలడా?

చాందినీ గంతులువేయడం ప్రారంభించింది. చెంగు చెంగున ఎగిరింది. పరుగెత్తింది. రాళ్ళమీది కెక్కింది. పల్లంలోకి దూకింది. కాలుజారి కింద అగాధంలో పడబోయి మెల్లగా కాళ్లు నిలవరించుకొంది. చాందినీ ఒకటే తిరుగుతున్నా పది మేకలు తిరుగుతున్నవని అనుకొనే టట్లుగా చేసింది.

పచ్చగడ్డిని ఇష్టంవచ్చినట్లుగా మేసింది. కొమ్ములతో పచ్చగడ్డినీ, కొమ్మల్నీ పొడిచింది. తల ఎత్తి ఆల్మోరా వంకకు చూసింది. అబ్బా ఖాను ఇల్లూ, ముళ్ళదొడ్డీ కన్పించినవి. వాటిని చూచి తెగనవ్వుకొన్నది. ఎంత చిన్న ఇల్లు! ఎంత చిన్న దొడ్డి! ఇన్ని రోజులూ అంత చిన్న దొడ్లో ఎట్లాఉన్నానో? పర్వత శిఖరంమీదఉన్న చాందినీకి ఆల్మోరా ఏంతో చిన్నదిగా కన్పించినది.

తన జీవితంలో ఆ రోజు ఎంతో ఆనందప్రదం అనుకొన్నది. ఇష్టంవచ్చినట్లుగా గంతులు వేసింది. ఇంతలో కొండమేకల గుంపు ఒకటి వచ్చింది. ఆ మేకలన్నీ చాందినీకి స్వాగతమిచ్చినవి. ఆ గుంపులో రకరకాల మేకలు ఉన్నవి. ఆ గుంపులోవి తెల్లతెల్ల మచ్చలుగల నల్ల మొగమేక చాందినీకి బాగా నచ్చింది. రెండూకలిసి చాలసేపు గంతులు వేసినవి. అవి రెండూ ఏమేమి మాట్లాడుకొన్నవో, భగవంతునికే తెలి యాలి. అవి మాట్లాడుకొన్నచోట ఒక సెలయేరు ప్రవహిస్తూఉన్నది. బహుశా అడిగితే ఆ సెలయేరు చెప్పుతుందేమో!

మేకలగుంపు ఎటో వెళ్ళిపోయింది. ఆ మొగమేక గూడా అటూ ఇటూ తిరిగి మళ్ళీ గుంపులో కలిసిపోయింది.

చాందినీగూడా అప్పుడే గుంపులో కలిసిపోదా మనుకున్నది. కాని తన స్వేచ్ఛకు భంగమనుకొన్నది. ఇంకా కొంతకాలం అటూ ఇటూ తిరుగుదామనుకొన్నది. సాయంత్రమయింది. చల్లటిగాలి ప్రారంభించింది పర్వతం అంతా నల్లగా కన్పించడమారంభించింది. "అయ్యో! అప్పుడే సాయంత్రమయిందే" అనుకొని విచారపడ్డది చాందినీ.

చీకట్లో అబ్బాఖాన్ ఇల్లూ, ముళ్లదొడ్డీ మంచులో అదృశ్యమై పోయినవి. కింద మేకల్ని వాటి యజమానులు దొడ్లల్లోకి తోలుకొని పోతు న్నాడు. మేకల మెళ్ళల్లో కట్టబడిన గంటలు గణగణ మోగుతున్నవి.

చాందినీ ఆ ధ్వనిని బాగాగుర్తించింది. బాగాచీకటి వ్యాపించింది. పర్వతం మీద ఒకమూలనుండి ఖూ—ఖూ అని ధ్వని వినిపించింది.

ఆ ధ్వని వినగానే చాందినీకి తోడేలు జ్ఞాపకం వచ్చింది. పగలు చాందినీ తోడేలు సంగతి ఆలోచించనేలేదు. పర్వతంకిందనుండి ఒకఈల వినవడింది. అబ్బూఖాన్ చాందినీకోసం చివరి ప్రయత్నం చేస్తున్నాడు. అతనిదే ఆ యీల. తిరిగి రమ్మని చాందినీని పిలుస్తున్నాడు. అటునుండి అబ్బూఖాన్ పిలుపూ, ఇటునుండి తోడేలు ఖూఖూ ధ్వని వినిపిస్తున్నవి.

తిరిగి అబ్బూఖాన్ దగ్గరకు పోదామనుకున్నది. కాని, మేకు, తాడు, ముళ్ళకంచ అన్నీ జ్ఞాపకం వచ్చినవి. ఆ అస్వతంత్ర జీవితంకంటే ఈ మృత్యువే మంచిదనుకొన్నది. అబ్బూఖాన్ విసుగుజెంది ఇంటికివెళ్ళిపోయినాడు. వెనుకనుండి ఆకులు గలగలా చప్పుడైనవి. చాందినీ వెనక్కు తిరిగి చూసింది. రెండుచెవులు కనపడ్డవి. రెండు కళ్లు చీకట్లో మెరుస్తున్నవి. తోడేలు వచ్చేసింది.

తోడేలు నేలమీద కూర్చున్నది. దాని దృష్టి అంతా చాందినీమీదనే ఉన్నది. తొందరేమిటి? మేక ఎక్కడకు పోతుంది? అని తోడేలు ధైర్యం. మేక తోడేలుపంకకు తిరిగింది. ఓహోహో! మీరా. అబ్బూఖాన్ గారి మేకపిల్లగారా? బాగా దాణాతిని లావెక్కారు అంటూ తోడేలు ఎర్రటి నాలుకను నీలంగాఉన్న పెదవులమీద తిప్పింది! చాందినీకి అబ్బూఖాన్ చెప్పిన కల్లూ కథ జ్ఞాపకం వచ్చింది. కల్లూలాగ తెల్లవారేదాకా దెబ్బలాడడం అనవసరం. వెంటనే ఆత్మసమర్పణం చేసుకోవడం మంచిదనుకొన్నది. కాని అప్రయత్నంగానే కొమ్ములువంచి తోడేలుతో దెబ్బలాడడానికి సిద్ధపడింది. అది వీర స్వభావం. చాందినీ తన వంశ గౌరవాన్ని గుర్తించని రకంకాదు. తోడేలు బలంగలదనే సంగతి దానికి తెలుసును. మేకలు తోడేళ్లను ఏమీ చెయ్యలేవనే సంగతిగూడా చాందినీకి తెలుసును. జయాపజయాలు భగవదాధీనాలు. కల్లూవలె తెల్లవారేదాకా తోడేలును ఎదుర్కొనగలగాలి అనుకొన్నది.

తోడేలు ముందుకు సాగింది. చాందినీగూడా కొమ్ములతో తోడేలు మీదకు దూరసిల్లింది. కొమ్ములతో కుమ్మి తోడేలును వెనుకకు పడేటట్లు చేసింది. అలాగే తెల్లవార్లూ తోడేలుకూ చాందినీకి యుద్ధం జరిగింది.

తొందరగా తెల్లవారితే బాగా ఉండునని చాందిసీ అనేకసార్లు నక్షత్రాలను ప్రార్థన చేసింది.

నక్షత్రాలు ఒక్కొక్కటిగా అదృశ్యమైపోయినవి. చాందిసీ చివరి ప్రయత్నం చేసింది. తోడేలుగూడా విసిగిపోయింది. దూరాన్నుండి ఒక కాంతి కనపడింది. ఒకకోడి కొక్కరో కో అని దూరాన్నుండి కూసింది. నా శక్తి కొద్దీ దెబ్బలాడాను. భగవానుడా! ఇక నీదే భారం అన్నది. కింద మసీదులో ఫకీరు "అల్లాహో అక్బర్" అని చివరిసారి అరిచాడు. ఆ ధ్వనిని చెవులారా విన్నది. స్మృతితప్పి కింద పడిపోయింది. దాని తెల్లటి శరీరం ఎర్రబడిపోయింది. తోడేలు చాందిసీని తినేసింది. చెట్లమీద పక్షులు కూర్చొని ఆ దృశ్యాన్నంతా చూస్తున్నవి. "జయం ఎవరిది" అని పక్షులు చర్చించుకొంటున్నవి. చాలా పక్షులు తోడేలు జయించిదన్నవి. కాని ఒక ముసలి పక్షి చాందిసీ జయించిందన్నది.

# పరిచయం

రుకైయ్యా రీహానా ఉన్నతవిద్యావంతురాలు. స్త్రీ జీవితాన్ని చిత్రించడంలో అసమానమైన ప్రతిభావంతురాలు. ఉర్దూ కథాసాహిత్యంలో విశిష్టస్థానాన్ని సంపాదించుకొన్నది. ఆమె రచనలలో మానవహృదయంలోని ఆంతరికవేదనా, మాతృత్వ, నారీత్వములలో[illegible], ప్రధానస్థానాన్ని ఆక్రమిస్తవి. "తల్లి" ఆమె ఉత్తమకథలలో ఒకటి.

# తల్లి

మాస్టరు హామీద్ ఢిల్లీలో కారహాటోటీలోని ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడు. అతడి అసలు నివాసస్థానం రషీదాబాదులోని పహాడీ మొహల్లా. అతని తండ్రి రషీదాబాదులో కంచరిపనిచేస్తూ ఉండేవాడు. హామీద్ బాల్యంలో తన పేటలోని మసీదులోనూ, తరువాత కొంది రోజులు ముల్లా సాహెబు వద్దనూ, ఆ తరువాత తండ్రిగారి ఇష్టప్రకారం కొంతకాలం తాలూకా స్కూలులోనూ చదువుకొన్నాడు. హామీద్ ఉర్దూ ప్యాసయిన రోజుల్లో రషీదాబాద్‌లో ప్లేగువ్యాధి వ్యాపించి హామీద్ తండ్రిని బలిగొన్నది. ఆయన అంత్యకర్మలన్నీ పూర్తి చేసిన తరువాత హామీద్ తల్లి దగ్గర లెఖ్ఖ చూసుకొంటే డెబ్బయి రూపాయలు మిగిలినవి. మిడిల్ ప్యాసయిన తరువాత హామీద్‌కు ఇంగ్లీషుగూడా చదువు కొందామని అభిలాష కలిగినది. కాని ఎలాగా చదువుకోడం?

వీరి పేటలోఉండే ఒకాయన ఢిల్లీలో పోలీసుగా ఉండటంవల్ల హామీద్ రెండు మూడు సార్లు ఢిల్లీని గురించి విని ఉన్నాడు. అందువల్ల తల్లిదగ్గర పదిహేను రూపాయలు తీసుకొని మెల్లగా ఢిల్లీ చేరుకొన్నాడు.

పోలీసు కానిస్టేబిల్ నసరుల్లాఖాన్ ఇల్లు ఎలాగా తెలుసుకోవడం! చచ్చిచెడి అతని ఇల్లు తెలుసుకొన్నాడు. నసరుల్లాఖాన్ హామీద్ తండ్రిని బాగా ఎరుగును. అందువల్ల అతను హామీద్‌ను ఆదరించి తన ఇంట్లో ఉండి చదువుకోడానికి అవకాశం కలుగజేశాడు. నసరుల్లాఖాన్ ఇంట్లోనే ఉంటూ హామీద్ మూడు సంవత్సరాల్లో పదో క్లాసుకు వచ్చాడు. లెఖ్ఖల్లో హామీద్ నిధి. ఒక సహాధ్యాయుడికి పాఠం చెప్పడం ప్రారంభించి నెలకు

ఏడు రూపాయలు సంపాదించడం ఆరంభించాడు. ఏడు రూపాయలు తన భోజనానికి సరిపోతవి గనుక వేరుగాఉంటానని తాను ఎంత బ్రతిమిలాడినా నసరుల్లాఖాన్ అంగీకరించనందున, హమీద్ విధిలేక అక్కడే ఉండిపోయినాడు.

ఆవిధంగా పది నెలల్లో హమీద్ డెబ్బయి రూపాయలు రొఖ్ఖం సంపాదించాడు. తల్లి దగ్గరనుండి తెచ్చినవి పది రూపాయలు మిగిలి ఉన్నవి. ఒకసారి తల్లి రెండు రూపాయలు మనియార్డరు పంపించింది. మొత్తం అతని దగ్గర ఎనభయిరెండు రూపాయలు పోగుపడినవి. స్కూలుకు వేసవికాలపు సెలవులిచ్చారు. నసరుల్లాఖాన్‌గూడా సెలవు బెట్టాడు. ఇద్దరూ కలిసి రషీదాబాద్ వచ్చారు.

అప్పటికి హమీద్ తల్లిదగ్గర భర్త అంత్యక్రియలు చేయగా మిగిలిన డబ్బు పన్నెండు రూపాయలు మిగిలిఉన్నవి. ఇంటిముందున్న పనసచెట్టు అమ్మడంవల్ల ప్రతిసంవత్సరం పాతికరూపాయిల ఆదాయం వస్తూఉండేది. ఇంటికి పోయేటప్పటికి తల్లి హమీద్‌కు వివాహసంబంధం మాట్లాడి సిద్ధంచేసిపెట్టింది, ఆ డబ్బు హమీద్‌దగ్గర ఉన్న డబ్బు అంతా ఖర్చుపెట్టి ఏదోవిధంగా హమీద్‌ఖాన్ వివాహం పూర్తిచేసింది. పెళ్ళి అయిన ఏడోరోజున తిరిగి హమీద్ ఢిల్లీ వెళ్ళాడు. ఆ సంవత్సరం పరీక్షలో కృతార్థుడు అయినాడు.

ఇక ఉద్యోగం: ఒక ప్రైవేటు స్కూల్లో కొద్దిరోజులు నౌకరీ కుదిరింది. తరువాత ఇంకొకస్కూళ్ళో—ఆ తరువాత ఇంకొకస్కూళ్ళో—చివరకు ఒకస్కూళ్ళో—అతని పనిచూసి సంతోషించి ఆ స్కూలు ప్రధానోపాధ్యాయుడు అతడి ఉద్యోగం ఖాయంచేశాడు.

నెలకు ఇరవయిరూపాయల జీతం. ఇక వేరే కాపురం పెడతానని హమీద్ నసరుల్లాఖాన్‌ను అడిగాడు.

ఒంటరిగా కాదు. భార్యనుగూడా తీసుకొనిరమ్మని నసరుల్లాఖాన్ మూడురూపాయలు అద్దెకు ఒక చిన్నఇల్లు కుదిరించిపెట్టాడు. హమీద్ ఖాన్ రషీదాబాద్ వెళ్ళి భార్యను తీసుకొచ్చి ఆ ఇంట్లో కాపురంపెట్టాడు. రషీదాబాద్‌లో తల్లి ఒంటరిగా ఉండిపోయింది.

హమీద్ భార్యను ఢిల్లీ తీసుకొనివచ్చి ఏడు సంవత్సరాలు గడిచింది. అతనికి ముగ్గురు మొగపిల్లలూ, ఒక ఆడపిల్లా పుట్టారు. వారిలో ఒక మొగపిల్లవాడూ, ఆడపిల్లా చనిపోయినారు. హమీద్ భార్యకుగూడా చాలా జబ్బుచేసింది. ఒకసారి హమీద్‌కు ఎండదెబ్బ తగిలి పదిహేను రోజులు మంచంలోనే ఉండిపోయినాడు. అటుస్కూల్లో పని పెరిగిపోయింది. ఇటు జీతం ముప్పయి రూపాయలయింది. పదిరూపాయలు ప్రైవేటుచెప్పి సంపాదించేవాడు. కాని ఢిల్లీలో ఆ డబ్బు అతనికి ఏమాత్రమూ సరిపోయేది కాదు. తల్లి రషీదాబాద్ రమ్మని ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాసేది. కాని డబ్బులేక తల్లిని చూడవలెనని ఎంత కుతూహలమున్నా హమీద్ రషీదాబాదు పోలేకపోయినాడు.

రోజూ ఉదయమే లేచి మసీదుకు పోయి నమాజు చేసుకోవడం, ఇంటికి తిరిగి వచ్చిన తరువాత కురాన్‌లోనుండి ఒక అధ్యాయం పారాయణచేయడం అతనికి అలవాటు. మసీదునుంచి ఇంటికి వస్తూఉన్నప్పుడు రోజూ ముసలిచాకలిది జానకి నడుమువంగిపోయి కర్రపోటువేసుకొంటూ చాకిరేవుకు పోతూ కనపడేది. కాని ఎందువల్లనో ఐదు రోజులనుండి జానకి కనపడడంలేదు. హమీద్‌కు ఆశ్చర్యం వేసింది. జానకి కనపడని రోజు లేదే; ఎందువల్ల ఐదు రోజులనుండి కనపడడంలేదో తెలుసుకుందామని జానకి ఇంటికి వెళ్లాడు. జానకి ఏమైందని అక్కడివాళ్లను ప్రశ్నిస్తే నిన్నరాత్రి చనిపోయిందని వాళ్లు జవాబు చెప్పారు.

జానకి చనిపోయిందని వినగానే హమీద్ గుండె గుభీలుమన్నది. జానకికి హమీద్‌కు ఏమి సంబంధమున్నదో భగవంతునికి తెలియాలి: స్కూలుకు పోయినాడు. అక్కడ అతనికి ఏమీ తోచలేదు. ఏదోవిధంగా కాలక్షేపం చేసి స్కూలు వదలిపెట్టగానే ఇంటికి చేరాడు. భార్య "శరీరం బాగాలేదా?" అని అడిగింది. ఏమీ వినిపించుకోలేదు. తెల్లవార్లూ అతనికి నిద్ర పట్టలేదు. మర్నాడు బక్రీదు. స్కూలుకు సెలవ. స్టేషనుకు పోయి రషీదాబాద్‌కు టిక్కట్టు కొన్నాడు. రైల్లో బస్దాడు. బక్రీదురోజు పగలల్లా రైల్లోనే గడిచింది. నమాజులేదు. కుర్బానీ లేదు. ముసలితల్లి ధ్యాసే. కళ్లముందు ముసలితల్లి కన్పించడమారంభించింది. తెల్లబడిపోయిన వెంట్రుకలు, ముడతలుపడిపోయిన శరీరం, వంగిపోయిన నడుము.

భార్య, పిల్లలమీద మక్కువవల్ల హమీద్ ముసలితల్లిని మరచి పోలేదు. నాలుగైదుసార్లు ఏడెనిమిది రూపాయలు తల్లికి మానియార్డరు గూడా పంపించాడు. ఆ డబ్బు పంపినప్పుడల్లా తనూ, తన పిల్లలూ చాలా ఇబ్బంది పడేవాళ్లు. తన తల్లికి ఉత్తరాలు వ్రాసినప్పుడు పిల్లలచేత గూడా ఆ ఉత్తరాలమీద ఏవో గీతలు గీయించేవాడు. ఆ పిచ్చిగీతలు చూసి తన తల్లి సంతోషించవలెనని అతని అభిప్రాయం. అతని భార్య గూడ వ్రాయడం నేర్చుకొన్నది. అత్తగారికి సలాములు తెలియపరుస్తూ ఉండేది. అటునుండి తల్లి మాటమాటకి రమ్మని పక్కఇంటి దర్జీ ఆమె చేత ఉత్తరాలు వ్రాయిస్తూ ఉండేది. వచ్చే సంవత్సరం పంటరోజుల్లో తప్పక వస్తానని వ్రాసేవాడు. కుటుంబంతో పోవాలి. చేసేది ఉద్యోగం గనుక యేవో కానుకలు తీసుకొనిపోవాలి. పళ్ళు ఫలాలు తీసికొనిపోవాలి. అందుకు డబ్బుగావాలి. వచ్చే జీతంతో తిండి గడవడమే కష్టంగా ఉండేది. అందువల్ల ఎప్పటికప్పుడు ప్రయాణం ఆపుకొనేవాడు. కాని జానకి మరణవార్త విని గుండె పగిలినట్లయి ఆగలేక ఒంటరిగా బయలుదేరాడు.

బక్రీదునాడు సూర్యాస్తమయం సమయానికి హమీద్ రషీదాబాద్ చేరాడు. పైనుండి ఘోరున వర్షం కురవడం ఆరంభించింది. అతనికి స్మృతి వచ్చినట్లయింది, గొడుగుమాత్రం చేతులో ఉన్నది. అయ్యో! గుడ్డలన్నా తెచ్చుకోలేదనుకున్నాడు. గొడుగువేసుకొని బయలుదేరాడు. జనం నివసించే చోట నీళ్ళు నిలవగూడదనే ఆరోగ్యసూత్రం గ్రామస్థులకు అర్థమే అయ్యేదికాదు. అర్థమైనా వాళ్ళు పట్టించుకొనే వాళ్ళుకారు. మోకాళ్ళలోతు నీళ్ళలో పడుతూ, లేస్తూ మెల్లగా యింటికి చేరుకొన్నాడు. తలుపు లోపల వేసిఉన్నది. తలుపుతట్టాడు. "అమ్మా! అమ్మా!" అని పెద్దగా పిలిచాడు.

లోపలనుండి ఒక లావుపాటివాడు వచ్చి తలుపులు తెరిచాడు. బక్రీదు పిండివంటలన్నీ తిని అరగడానికి నిద్రబోయి అప్పుడే లేచినట్లు కనపడ్డాడు, హమీద్‌ను గుర్తుబట్టి మూడుసంవత్సరాల క్రితం ఆ యిల్లును కొన్నట్లున్నూ. హమీద్ తల్లి దర్జీ ఆమె ఇంట్లో వున్నదనిన్నీ చెప్పాడు. తలుపువేసుకొని లోపలికి వెళ్ళిపోయినాడు.

హమీద్‌కు అడుగు ముందుకు పడలేదు. ఇల్లుగూడా అమ్మవలసినంత కష్టంలో తల్లి పడిపోయింది కాబోలు ననుకున్నాడు. పనసచెట్టు

ఆదాయంతో కాలక్షేపం చేస్తున్నదనుకొని చాలా పొరపాటు చేశానను కొన్నాడు. ఆ తల్లికి మొఖం చూపించడమెలా? ఎంత స్వార్థం తనలో బలిసిపోయింది. తన పిల్లల మంచినీ, తన మంచినీ తను చూసుకున్నాడే గాని ముసలితల్లిని గురించి ఆలోచించనైనా లేదుగదా అని పశ్చాత్తాప పడ్డాడు. మెల్లగా దర్జీ ఆమె ఇంటిదగ్గరకు కాళ్ళీడ్చుకుంటూ చేరాడు. తలుపు తట్టబోయినాడు. చెయ్యి లేవలేదు. మెల్లగా తలుపుతట్టాడు. "అమ్మా!" అని పిలిచాడు. దర్జీసోతి వచ్చి తలుపుతీసింది. హమీద్‌ను గుర్తుపట్టింది. "హమీద్ వచ్చాడు. హమీద్ వచ్చాడు" అంటూ లోపలకు పరుగెత్తింది.

హమీద్ తల్లి ఈమధ్య అశక్తతవల్ల ఇంట్లో అటూ ఇటూ నడవ బడంగూడా మానుకొన్నది. ఆమె కళ్ళుగూడా ఏమీకనిపించేవికావు. కాని హమీద్ వచ్చాడనడంతోనే ఆ సంతోషంలో ఎక్కడనుండి శక్తివచ్చిందో గభీమనిలేచి వాకిట్లోకి దూకి హమీద్‌ను ఆలింగనం చేసుకొన్నది. వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమె శరీరంలో ఎముకలు తప్ప ఏమీలేవు; తలమీద వెంట్రుకలు తెల్లబడి పోయినవి. నడుము వంగిపోయింది. మెడ శిరస్సు భారాన్నిగూడా వహించలేకుండా ఉన్నది. ప్రేమవల్లనో, లేక ముసలి తనం వల్లనో ఆమె శరీరం వణుక నారంభించింది. చాలసేపు ఇద్దరూ మాట్లాడలేకపోయినారు. చివరకు తల్లి మెల్లగా కంఠంపెకలించుకొన్నది "నాయనా! చాల దూరంనుండి వచ్చావు గుడ్డలన్నీ తడిసిపోయినవి. గుడ్డలు మార్చుకో. టీ తీసుకొని వస్తాను, పిల్లలంతా కులాసాగా ఉన్నారా?" అని ప్రశ్నించింది.

అమ్మా! ఇల్లు అమ్మివేశావా? నాకు తెలియజేయ లేదేమి? అని అడిగాడు.

"నాయనా! నీకు తెలియజేస్తేమాత్రం నువ్వేమి చేస్తావు? నీకు మాత్రం కష్టాలు తక్కువగా ఉన్నవి గనుకనా? కాని, ఈ దర్జీ సోతి నాకు చాలా సహాయం చేస్తున్నది. నీకష్టాలు నీకుగాక నాబాధకూడా నీ కెందుకు నాయనా? ఈ జన్మలో నిన్ను చూడలేనేమో అనుకున్నాను, నువ్వు వచ్చావు" అన్నది.

హమీద్ కళ్ళవెంట బొటబొటా నీళ్లు కార్చాడు. ఇల్లు నలువైపులా కలయజూచాడు. ఎదుట చిన్నమంచంమీద దర్జీ ఆమె ఇద్దరు పిల్లలూ నిద్రపోతున్నారు. ఒకపిల్లవాడు కింద ఆడుకుంటున్నాడు.

దర్జీ సోతీ పొయ్యి రాజేస్తున్నది. ఆమె తొడుక్కున్న రవికె వీపుమీద చిరిగిపోయి వున్నది. గుడ్డలుమాత్రం తెల్లగానే ఉన్నవి. బక్రీదు పండుగ కదూ!

"అమ్మా! రోజూ నీవు ఇక్కడనే నిద్రపోతూ ఉంటావా?"

"కాదునాయనా! ఆమె ఈ గదిలో పిల్లలతో పడుకొంటూంది. నేను అవతల గదిలో పడుకొంటాను" అన్నది తల్లి.

"అమ్మా! నీవు ఇంకా పనిచేస్తూనే ఉన్నావా? చేతులు పని చేయ నిస్తున్నయ్యా?

"చేతులు బాగానే ఉన్నవి గాని కళ్లుమాత్రం నెలరోజులనుండి కనపడడంలేదు నాయనా"

కళ్లు కనపడడంలేదా? అన్నాడు. ఆతురతతో హమీద్.

తల్లి హమీద్ తలను చేతితో నిమిరింది. చెయ్యి బుగ్గలదాకా పోనిచ్చింది. అతని తలను తన హృదయానికి హత్తుకొన్నది. చిరునవ్వు నవ్వింది. "నాయనా? కళ్లు కనపడడంలేదా అంటున్నావా? నాయనా? నీవు కనపడుతూనే వున్నావు. రోజూ సూర్యుడు కనబడతాడు. అంతే. మిగిలిన వస్తువులుఏమీ కనబడవు. చిన్న పిల్లవాడు కులాసాగా ఉన్నాడా? వాడి వయస్సెంత? అని అడిగింది.

"సంవత్సరంన్నర"

"అయితే చొక్కా, టోపీ వాడికి సరిపోతవి" అంటూ ఒక పాత గుడ్డల మూట విప్పి అందులోనుంగి ఒక చొక్కాను, బుటేదారీ పనిచేసి యున్న ఒక టోపీని బయటకు తీసింది.

"మజీద్ కోసం ఇవి తయారుచేశావా? అని హమీద్ కన్నీళ్లు కార్చాడు.

కాదు నాయనా: సలమాకోసం కుట్టి తయారుచేశాను. పంపుదా మంటే నీవు రానేలేదు. తరువాత సలమా చచ్చిపోయిందని ఉత్తరం వ్రాశావు!! అని చొక్కావంకచూపి కన్నీళ్లు పెట్టుకొన్నది. లేచి లోపలికి వెళ్ళిపోయింది. టీ తెచ్చి ఇచ్చింది. తాగాడు. తల్లి మంచంమీద కూర్చొని ఉండిపోయినాడు.

ఏమిచేమిటో ఆలోచనలు! హమీద్ తనను తాను మరచి పోయినాడు. అలా రెండు గంటలు గడిచింది. పక్క ఇంటి నసీబన్

కూడా వచ్చింది. నసీబన్, హమీద్‌తల్లి, కోతి వంట ఇంట్లో ఏమేమిటో చేస్తూ ఉండిపోయినారు.

షుమారు ఎనిమిది గంటలకు హమీద్‌తల్లి బయటికి వచ్చి "నాయనా! భోజనానికి లేవమ"న్నది.

అప్పటికి హమీద్‌కు కొద్దిగా నిద్రపట్టింది. ఉలిక్కిపడి లేచాడు.

బీద స్థితిలో ఉన్నది గనుక తల్లి జొన్నరొట్టె తయారుచేసి ఉంటుందనుకొన్నాడు. కాని వడ్డించిన పదార్థాలనుచూసి ఆశ్చర్యపడ్డాడు. కబాబు, మేక గుండెకాయ కూర, పొరాటాలు, మినప్పప్పు పప్పు; మామిడి కాయ పచ్చడి; ఒక కప్పులో మీగడి, ఒక ప్లేటులో పండిన మామిడి పండు ముక్కలు ఘుమఘుమ లాడుతున్నవి. ఇంత బీదతనంలో ఉన్న తల్లి ఈ సామానంతా ఎలా సేకరించిందా అని ఆలోచించాడు. భోజనం చేశాడు. భోజనంచేసినంతసేపూ తల్లిదగ్గర కూర్చొని లోకాభిరామాయణం చెప్పింది. కొసరి కొసరి వస్తువులు వడ్డించింది. తృప్తిగా భోజనం చేశాడు. లేచి చేతులు కడుక్కొని మంచంమీదకు చేరాడు.

దర్జీఆమె, నసీబన్ ఇద్దరూ బయటకు వెళ్ళి కొంత సేపట్లో తిరిగి వచ్చారు.

తల్లి హమీద్ దగ్గరకు వచ్చింది. "నాయనా! ఒక్కమాట చెప్తాను. వింటావా?" అని అడిగింది.

హమీద్ మొఖం వెలవెల బోయింది. గుండె దడదడ లాడింది. బహుశా తల్లి తనతోగూడా ఢిల్లీ వస్తానంటుం దనుకొన్నాడు. లోలోపల అనేక ఆలోచనలు! తనకు వచ్చే జీతం చాలా కొద్ది. ఢిల్లీలో ఆ కొద్ది జీతంమీద అంతమందీ బ్రతకడం ఎలాగా? భార్యా, పిల్లలూ, తల్లీ యింత మందినీ తను పోషించ గలడా! తల్లివంక అలాగే చూస్తూ ఉండి పోయినాడు.

"నాయనా నీవు పట్టణంలో ఉండేవాడివి. నౌకరీదారుడివి. నేను పరాయవాళ్ల పంచల్లో తలదాచుకొంటున్నాను, నీకు ఎలా మర్యాద చేయ గలను? నసీబన్‌ను పంపించి ఖాన్‌సాహెబుగారి ఇంట్లో ఒక గది బాగు చేయించాను. మంచం, పక్కా వేయించాను. కాని నీవు నాతోబాటే ఉంటే బాగాఉంటుందని నా మనస్సు కోరుతున్నది. ఈ ముసలిముండతో కూర్చొమంటే నీకు మనస్సుకు ఏమి కష్టం కలుగుతుందోనని చూస్తు

న్నాను. భయపడుతున్నాను. నాయనా! నా కోరిక పూర్తిచేస్తావా? అని భయపడుతూ అడిగింది.

"అదుగో, మంచంగూడా తెప్పించాను" అని ఎదట పరచిఉన్న మంచం చూపించింది.

తల్లి మాటలకు హామీద్ గుండె కరిగిపోయింది. నోటనుండి మాట రాలేదు. "అమ్మా! నీ దగ్గరఉండకపోతే నేను యింకెక్కడకు పోతాను?" అన్నాడు.

తల్లి ఆనందసంభరితురాలయింది. హామీద్ శిరస్సును అఘ్రాణించింది. నసీబన్‌ను పిలిచి మంచం తన గదిలో వేయించింది. ఒకమూట విప్పి తెల్లటి దుప్పటి బయటకు తీసింది. ఆ దుప్పటిమీద రకరకాల లతలు కుట్టిఉన్నాయి. ఆ మూటలోనుంచి రెండుదిండ్లు బయటకుతీసింది. తెల్లటి గలీబులు తొడిగిఉన్నవి. చిన్న సీసాలోనుంచి తీసి గలీబులకు అత్తరు రాసింది మంచంకింద ఒక పీక్‌దానును పెట్టించింది. ఢిల్లీవూల నల్ల చెప్పుల జోడు — కొత్తది — మంచం కాళ్లవైపున పెట్టి "నాయనా! అలసిపోయినావు. ఈ మంచంమీద పడుకొని నిద్రపొమ్మన్న"ది.

హామీద్ ఈ తమాషా అంతా చూస్తున్నాడు. యా అల్లాహ్! ఈ సామానంతా ఎలా వచ్చింది? చివరకు తల్లిని అడిగాడు.

రషీదాబాద్‌గూడా చిన్న బస్తీలాంటి గ్రామమే. అన్నీ ఈ ఊళ్లోనే దొరికినవని జవాబు చెప్పింది.

"అమ్మా! భోజనం సంగతి సరే. ఈ చెప్పులు, ఈ పీక్‌దాను. ఈ దుప్పటీ ఇవన్నీ ఎలా కొన్నావు?"

తల్లి వేడివేడి కన్నీళ్లు కార్చింది. మాతృదేవతా వాత్సల్యం అనుపమానం! "ఏడు సంవత్సరాలు ఎదురు చూశాను. ఇల్లు అమ్మాను. పొట్ట బిగించుకొని నీ కోసం, నీ పిల్లలకోసం ఈ వస్తువుల్ని సేకరించాను. నీ కోసం ఎదురు చూసిచూసి కళ్లు కాయలు గాచినవి. నాయనా! ఈ వస్తువుల్ని సేకరించటానికి ఏడు సంవత్సరాలు పట్టింది. సలమాను చూడనే లేదు" అంటూ వెక్కివెక్కి ఏడ్చింది.

తల్లి మాటలను విని శాంతిదేవత ఆ చిన్నగదినిండా తన రెక్కలను విప్పింది. ఇక ఎవరూ ఏమి మాట్లాడలేదు.

తెల్లవారింది. హామీద్ తల్లి ఇక కళ్లు తెరవలేదు.

# విశ్వసాహిత్య గ్రంథమండలివారి ప్రచురణాలు

**అచ్చయినవి :**

1. కళ - జీవితము (ఆచార్యకాకా కాలేల్కర్) 1 0 0
2. ఉర్దూ కథలు 0 12 0

**అచ్చుకానున్నవి :**

3. కాలేల్కర్ వ్యాసాలు
4. ధర్మయుద్ధం (మహదేవదేశాయి) (గాంధీమహాత్ముడు స్వయంగా నడిపిన అహమ్మదాబాదు మిల్లుకార్మికుల సమ్మె వివరాలు)
5. హిందీ కథలు
6. బెంగాలీ కథలు
7. తెలుగు కథలు
8. మరాఠీ కథలు
9. గుజరాతీ కథలు
10. కన్నడం కథలు
11. డైరీలోని కొన్ని పేజీలు (ఘనశ్యామదాస్ బిర్లా) (మహాత్ముడు రౌండుటేబిల్ సమావేశమునకుపోయిన నాటి విశేషాలు)
12. ఉస్తాద్‌జీ పాండేయ బేచనశర్మ "ఉగ్ర" (నవల)

ప్రతులకు :

శ్రీ అంబటిపూడి కృష్ణమూర్తి,
విశ్వసాహిత్య గ్రంథమండలి,
బెజవాడ.

